# చందాదారులకు మనవి

ఆర్యా,

ఈ మధ్యకాలంలో న్యూస్‌ప్రింట్ ధర విపరీతంగా పెరుగుచున్నది. న్యూస్‌ప్రింట్ కోటా 'శ్రీవాణి' కి లేదు. ప్రభుత్వ ప్రకటనలు (Advertisements) రావు. ఎప్పుడో సంవత్సరానికొక పర్యాయం ముద్రించే ప్రత్యేకసంచికలో తప్ప నెలవారీ సాధారణసంచికలలో అడ్వర్‌టైజ్‌మెంట్స్ కనిపించవు. సామాన్య పాఠకులను ఆకర్షించడానికి **అర్ధ నగ్న దృశ్యాలు** కనిపించవు. సెక్స్ సాహిత్యం ఉండదు. సినిమాబొమ్మలు కానరావు. ఎల్లో జర్నలిజం అసలే ఉండదు. ఇటువంటి పత్రికను ఈ కాలంలో నడపటం ఒక సాహసమే అయినప్పటికీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి మీద భారం వేసి నడుపుతున్నాను. **"శ్రీవాణి నా వాణే"** అన్నారు గదా బాబాగారు. కనుక శ్రీవాణి బాగోగులు వారే చూచుకుంటారనే నమ్మకంతో, విశ్వాసంతో, నిమిత్తమాత్రంగా నడుపుతున్నాను.

| | 1985 సం. | 1994 సం. | 1995 సం. |
|---|---|---|---|
| న్యూస్‌ప్రింట్ డబల్ క్రౌన్ రీము ఖరీదు | రు. 76-00 | రు. 160-00 | రు. 220-00 |
| శ్రీవాణి సం॥ చందా | రు. 30-00 | రు. 48-00 | రు. 54-00 |

శ్రీవాణి ప్రారంభించిననాటినుండి నేటివరకు న్యూస్‌ప్రింట్ రేటు మూడు రెట్లుపైన పెరిగినప్పటికీ, శ్రీవాణి చందా మాత్రం రెండు రెట్లు కూడా పెంచకుండా నడుపుతూ వస్తున్నాం. 1994 సం॥ కన్నా ఈ సంవత్సరం ప్రతి సంచికకు (ప్రతినెలా) రు. 2000/- లు అదనంగా న్యూస్‌ప్రింటుకు వెచ్చించవలసివస్తున్నది. **అయినప్పటికీ శ్రీవాణి చందాను మరల పెంచదల్చలేదు.**

సహృదయులైన పాఠకులు మా ఈ యిబ్బందిని సహృదయంతో గమనించి, గుర్తించి, అవకాశం వున్నవారు తమ అధీనంలో నున్న ప్రకటనలు (Advertisements) కాంట్రాక్ట్ పద్ధతి మీద శ్రీవాణికి అందించి, చేయూతనిచ్చి, ప్రోత్సహించి రెండు పర్యాయములు రాష్ట్ర స్థాయిలో ఉత్తమ అవార్డులనందుకొనిన ఉత్తమశ్రేణికి చెందిన "శ్రీవాణి"కి అండగా నిలుస్తారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను.

ధన్యవాదములు

భవదీయ

కొమరగిరి కృష్ణమోహనరావు

మార్చి 1995

సంపుటి : 11

సంచిక : 3


# శ్రీవాణి


సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడు పేట

మచిలీపట్నం - 521 001

ఫోన్ : 22818



| | |
|---|---|
| విడి ప్రతి | : రు. 4-50 |
| సంవత్సర చందా | : రు. 54-00 |
| 4 సం॥ల చందా | : రు. 200-00 |
| జీవిత సభ్యత్వం | : రు. 600-00 |
| పోషకులు | : రు.1,116/- |

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at SREE VANI PRINTERS MACHILIPATNAM

Despatched on 7-3-1995


## విషయసూచిక


| | | |
|---|---|---|
| 'దక్కన్ సర్దార్' జమలాపురం కేశవరావు | - భరద్వాజ్ | 2 |
| అమృతవాణి | - కూచిభట్ల చంద్రశేఖరశర్మ | 4 |
| అహంకారాన్ని చంపుకోవాలి | - శ్రీ సత్యసాయిబాబా | 5 |
| మతమావశ్యకమా ? | - శ్రీ శివచిదానంద భారతీస్వామి | 9 |
| శ్రీ సాయి సన్నిధి చేరు కాంక్ష | - పంచాంగం శివప్పశాస్త్రి | 12 |
| గీత-అమృతవర్షిణి | - సాయి గంగామహాదేవ్ | 13 |
| సైన్సువాణి-3 | - కె ఆర్ కె మోహన్ | 14 |
| సాయి గీతం | - రాయవరపు రవి | 15 |
| మనిషి-మనస్సు | - పాతూరి ప్రసన్నం | 16 |
| శ్రీ సత్యసాయిబాబావారితో నా అనుభవాలు | - డా॥ భాటియా | 21 |
| ప్రాణాలు తీసిన పాండిత్యము | - N.V R. సత్యనారాయణమూర్తి | 23 |
| అంతుబట్టని అద్భుతాలు - 15 | - భండారు పర్వతాలరావు | 25 |
| యువతావాణి-3 | - ఆర్. యస్. కె మూర్తి | 26 |
| మనోభిరామం-3 | - సోమంచి రామం | 28 |
| జననీ ! ప్రజోత్పత్తి ! శరణు | - పృథివి సుబ్బనాగయ్య | 29 |
| చిన్న కథ | - కె. సరోజనీదేవి | 29 |
| కొమరగిరి కారాగార లేఖలు | - | 30 |
| మహనీయులు - మరపురాని సంఘటనలు | - కవుల ఆంజనేయశర్మ | 32 |
| విజ్ఞాన రథసారథులు .... | - సాయిప్రియ | 35 |
| వ్యక్తులూ-వ్యక్తిత్వాలు-68 | - కంచి వాసుదేవరావు | 33 |
| కాలము పోవును మాట నిలుచును | - కొమరగిరి కృష్ణమోహనరావు | 38 |


ముఖచిత్రం : 'దక్కన్ సర్దార్' జమలాపురం కేశవరావు

# దక్కన్ సర్దార్ జమలాపురం కేశవరా॥

భరద్వాజ్

భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామంలోను, ముఖ్యంగా నిజాం ప్రభువుల నిరంకుశ పాలన ప్రతిఘటనోద్యమంలోనూ, నిర్భీకంగా పాల్గొని, ధైర్యసాహసములను ప్రదర్శించి, నిజాయితీతో, నిస్వార్థంగా సేవలనొనర్చి ప్రజల మెప్పును, అభిమానాన్ని చూరగొనిన యువకిశోరం జమలాపురం. అతడు పేదల పెన్నిధి. నిజాం పీడిత ప్రజానీక బాంధవుడు, మేరునగధీరత్వం, సంపూర్ణమైన ఆత్మవిశ్వాసం అచంచలమైన దీక్షా తత్పరత, నిర్భయత్వం మొదలైన ఉత్తమ లక్షణాలు మూర్తీభవించిన విగ్రహమే కేశవరావుగారు.

శ్రీ జమలాపురం కేశవరావుగారు జాతీయోద్యమ కాలంలో గాంధీజీ పిలుపునందుకొని, తాను చేస్తున్న ఉద్యోగాన్ని కాలదన్ని, తనను తాను ప్రజాసేవకు అంకితం చేసుకొనిన త్యాగధనుడు శ్రీ కేశవరావుగారు.

మహనీయుల చరిత్రలు భావితరాలకు స్ఫూర్తి ప్రదాయకాలు. మహాత్ముల జీవితాలు గుమ్మడిపాదు వంటివి. ఆ పాదు పుట్టిన స్థలమునుండి తీగ చాలా దూరం ప్రాకిపోయి అచట కాయలుకాస్తుంది. ఎందరికో ఆ కాయలనందిస్తుంది. ఎందరో వాటిననుభవించి ఆనందిస్తారు. అదే విధంగా మహనీయులుకూడా జన్మనిచ్చిన వారికన్నా, కట్టుకున్నవారికన్నా, కన్నవారికన్నా, ఇతరులకే ఎక్కువగాఉపయోగపడుతారు. అంటే వారిలో ఈషణ్మాత్రం స్వార్థం కనిపించదు. పరులకు సేవచేయటంలోనే పరమార్థమున్నదని భావిస్తుంటారు సమాజ శ్రేయస్సే వారి జీవిత లక్ష్యం.

శ్రీ కేశవరావుగారు ఒక పర్యాయం తన పిల్లల్ని చూచిపోదామని ఇంటికివస్తే, వారి బావగారు వ్యంగ్యంగా 'పిల్లలకేంతెచ్చారు? బట్టలా ? బొమ్మలా? పుస్తకాలా?' అని అడుగగా 'అవి తెస్తేనేగాని రావాలా ? లేకుంటే రాగూడదా ఏంటి ? అవును, నేనేం తేలేను పంచి ఇవ్వలేను మనసులోని మమత, అభిమానాన్ని మాత్రమే పంచిస్తాను మనిషికి ఆప్యాయత, అభిమానం ముఖ్యం కదా ! అవి వెలలేని ఆభరణాలు వాటిని ధరించాలి' అని కేశవరావు సమాధానం చెప్పారుట. వారి వేదనను అర్థం చేసుకుంటే బోధపడుతుంది మన కర్తవ్యం. వారి ఆవేదనలో పాలుపంచుకుంటే కర్తవ్యోన్ముఖులమవుతాం. అయితే స్వాతంత్ర్య సమరయోధుల మూగ బాధ సామాన్యులకు అర్థంకాదు. వారు పడిన వేదన, అనుభవించిన ఆవేదన అందరికీ బోధపడదు. వారి లక్ష్యం ఉన్నతంగా ఉంటుంది వారి ఆలోచన సంకుచితత్వంగా ఉండదు, ఉదాత్తత, ఉదారత వారి ఆభరణాలు ప్రేమ కరుణ, దయ వారి సద్గుణాలు. వారు త్యాగరాజులు, భోగరాజులు కాదు. వారు కార్యశూరులు, వాక్శూరులు గాదు. అందువలననే వారు అకుంఠిత దీక్షతో, అవిశ్రాంత పోరాటం కొనసాగించగలిగారు.

తన పిల్లలముందు ధనమునుగూర్చిగాని, ధనికుల లక్షణాలు, వేషభాషలగూర్చి గాని కేశవరావుగారు ఎప్పుడూ మాట్లాడేవారు కాదు తన బిడ్డలకు మంచి బట్టలు, ఆహారము, ఆటవస్తువులు – అన్నీ లభ్యం కావాలని ప్రతి తండ్రీ కోరుకుంటాడు అయితే కేశవరావుగారు తన కన్న బిడ్డల చిన్నకోరికను నెరవేర్చలేకపోయిన నిర్భాగ్యుడని చాలామందికి తెలియదు. తన కుటుంబపోషణకోసం ఎవరినీ యాచించలేదు, అడ్డదారులు తొక్కలేదు. ఒకమారు కేశవరావుగారు తన పిల్లవానితో బజారు వెళ్ళారు. 'నాన్నా ! నాన్నా ! ఆ బొమ్మ కావాలి ! ' అన్నాడు. ఆ పిల్లవాడు

వెంటనే "ఆ బొమ్మ ఖరీదు ఎంత ?" అని కొట్టువానిని అడుగగా 'ఎంతండీ! ధర సరసమే! పన్నెండు రూపాయలే! తీసుకోండి!' అన్నాడు షాపు యజమాని. 'పన్నెండే కదా! అలాగే ఒక సంవత్సరం. అన్ని రోజులు ఆగినా, అంత డబ్బు కూడుతుందో! లేదో! అప్పుడే వచ్చి తీసుకుందాం' అని మనసులో అనుకుంటూ కేశవరావుగారు వెళ్ళిపోతుండగా, ఇంతలో వారికి పరిచయం ఉన్న వ్యక్తి వచ్చి 'మీరు ఆ బొమ్మను తీసుకోండి! నేను డబ్బులు యిస్తాను' అని అంటాడు. అప్పుడు కేశవరావుగారు 'డబ్బులు లేనిది ఎవరిదగ్గర? అందరి దగ్గర ఉన్నవి. ఖర్చుపెట్టడానికే వెనకముందు. అయినా అది మంచి బొమ్మ కదా! దాన్ని తీసుకొని వెళ్ళితే మా పిల్లవాడు ఎన్ని రోజులు ఉంచుతాడో!' అనుకుంటూ వెళ్ళిపోతాడు. అంతేగాని తనకున్న ఆర్థిక యిబ్బందులను బయటపెట్టలేదు. కేశవరావుగారు స్వాభిమానంగల వ్యక్తి.

అది వరంగల్ జిల్లా పల్లగుట్ట గ్రామం అనాడు అక్కడ జరుగుతున్న సమావేశంలో శ్రీ కాళోజీ నారాయణరావు, దాశరథి, వానమామలై వరదాచార్యు, తిరునగరి రామాంజనేయులు మొదలగు కవులు మరెందరో కళాకారులు పాల్గొనినారు. అనాడు అక్కడ బుర్రకథ కూడా ఏర్పాటు చేయబడింది. కవులు కవితా గానం చేస్తున్నారు ప్రజలు ఆనందంతో చప్పట్లు కొడుతున్నారు. కవితాగోష్ఠి కూడా పూర్తి అయింది. తరువాత జరిగిన రాజకీయ సభలో ప్రధాన ఆకర్షణ శ్రీ జమలాపురం కేశవరావుగారు, ఆయన ఉపన్యాసం వినటానికి ఎదురుతెన్నులు చూస్తున్నారు ప్రజలు. అప్పుడు గంభీరమైన స్వరంతో 'ప్రియమైన ప్రజలారా! పీడిత, తాడిత సోదర సోదరీమణులారా! ఈ గ్రామంలో ఇంతమందిని చూడగలగటం నిజంగా నా అదృష్టం. పూర్వం మునులు పంచాగ్నుల మధ్య తపస్సు చేసి తామనుకున్న లక్ష్యమును చేరుకొనేవారట. మనముకూడా ఈనాడు పంచాగ్నుల మధ్య నిలబడి ఉన్నాము. 1) పోలీసు జులుం 2) రజాకార్ల దాడులు, 3) భూస్వాముల, జమిందారుల అక్రమాలు, 4) పటేల్ పట్వారీల దౌర్జన్యాలు, 5) ఆకలి మంటలు – వీటిమధ్య మనం జీవిస్తున్నాం. ఈ బానిస జీవితం తొలగాలి, స్వేచ్ఛా జీవులం కావాలి. అందుకొరకే నా ఈ పోరాటం. ఈ నా ప్రయత్నం ఫలిస్తుందని నా విశ్వాసం ఈ మహా పోరాటంలో మీరందరూ భాగస్వాములు కావాలి' అని చెబుతుండగా జనం మధ్య నుండి ఒక వృద్ధుడు వేదిక దగ్గరకు వచ్చాడు, దగ్గరకు వచ్చిన ఆ వృద్ధుని 'రండి! రండి!' అని ఆహ్వానించాడు కేశవరావుగారు. సభికులలో కొందరు కోపంగా చూస్తున్నారు, మరికొందరు కేశవరావుగారి ఉపన్యాసమునకు ఆటంకం కలిగినందులకు విసుక్కున్నారు. అప్పుడు ఆ వృద్ధశిఖామణి 'దీనజనులారా! మీరు ఎంతో ఆసక్తితో వింటున్న కేశవరావు ఉపన్యాసానికి ఆటంకం కలిగించినందులకు క్షమించండి. రెండే రెండు మాటలు చెప్పి ముగిస్తాను. తరువాత కేశవరావు ఉపన్యాసం కొనసాగుతుంది. ఒక వ్యక్తి తాను చేసిన సేవకు ప్రతిఫలాన్ని ఆశిస్తే, దాన్ని 'స్వార్థం' అంటారు. అలాకాకుండా ఇంకొకరు, ఆ వ్యక్తి చేసిన త్యాగమును గుర్తించి, బహుమానమును అందిస్తే 'సన్మానం' అంటారు. శ్రీ కేశవరావు ఎట్టి ప్రతిఫలాన్ని ఆశించకుండా 'సేవ' చేస్తున్నాడు. కాబట్టి మనమంతా అతనిని సన్మానించాలి. ఆ గంభీరమైన రూపం, ఉదాత్తమైన భావం, మంత్రముగ్ధుల్ని చేసే మాట, చక్కని దూరదృష్టిగల ఆలోచనలను అందిస్తున్న ఆ వ్యక్తిని చూస్తుంటే "దక్కన్ సర్దార్" అని పిలవాలనిపిస్తున్నది. ఉత్తరభారతంలో వల్లభాయిపటేల్ 'సర్దార్' అయితే 'దక్కన్ సర్దార్' జమలాపురం కేశవరావు ఈ బిరుదు ఈయనకు బాగుంటుంది మీరేమంటారు?' అని ప్రశ్నించగానే సభికులంతా 'దక్కన్ సర్దార్' జమలాపురం కేశవరావుగారికి జై అనే నినాదాలు

( తరువాయి 29 వ పేజీలో )

శ్లో॥ విపుల హృదయై రన్యైః కైశ్చిజ్జగజ్జనితం పురా
విధృత మపరైర్దత్తం చాన్యై ర్విజిత్య తృణం యథా
ఇహ హి భువనాన్యన్యే ధీరాశ్చతుర్దశ భుంజతే
కతిపయ పురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః ?

# అమృతవాణి

పూలిభట్ల చంద్రశేఖరశర్మ

ఈ విశాలమైన జగత్తును సృష్టించారంటే ఆ సృష్టించిన మహనీయులకెంతటి విశాల హృదయం వుండాలంటారు. ఎందుకంటే రకరకాల జీవరాసులు వాటికి కావలసిన అవసరాలు. పంచభూతాలు ఇవన్నీ ఈ జగత్తులోవేకదా ? జగత్తుకు భిన్నంగా ఏవీ బ్రతికే వీలు లేదు కదా ? కనుక ఆ సృష్టి కర్త బ్రహ్మ ఈ సృష్టి చేసి సమభావంతో ఎంత విశాల హృదయునిపించుకుంటున్నాడో ! అలాగే బ్రహ్మ సృష్టించిన ఈ లోకాలను చక్కగా పోషించే బాధ్యత విష్ణువు స్వీకరించాడు. ఈ జీవకోటి సమస్తానికి మనుగడకోసం ఎంత రక్షణయిచ్చి కాపాడుతున్నాడో మహానుభావుడు ? ఇది ఇలా వుంటే రాక్షసులు బయలుదేరి చల్లగా వుంటున్న జగత్తుకు లేనిపోని సంక్షోభం తెచ్చిపెడుతున్నారంటే వాళ్ళనేమనాలి చెప్పండి ? అసలు సృష్టించి పోషించే విశాల హృదయులయిన పెద్దలు లోకాలపై అనుగ్రహంతో ప్రేమతో ప్రవర్తిస్తుంటే ఈ రాక్షసులకేం వచ్చింది మధ్యలో ? చెడగొట్టే అధికారం వీళ్ళకెక్కడిది ? వుంటే విశాల హృదయుల మనస్తత్త్వం అంత విశాలంగా వుంటే ఈ సంకుచిత మనస్తత్వం కల నీచుల హృదయం యింతగా మూసుకుపోతోందన్నమాట. పెద్దలది దైవతత్త్వం నీచులది రాక్షసతత్త్వం. ఈ నీచులు ఈ జగత్తును దానధర్మాలు చేసేందుకు కూడా సిద్ధపడతారు. కొంతమంది ప్రబుద్ధులు తేరగా అనుభవిస్తూంటారు. నీచులు జగత్తు తమ సొంతమైనట్లుగా గడ్డిపోచలాగా యితరులకివ్వటానికి వెనుకాడరు అది వాళ్ళ త్యాగమనుకుంటారు.

నిజానికి త్రిమూర్తులు సృష్టి స్థితి లయ కర్తలయి ఎంతో కారుణ్యపూర్ణమైన విశాల హృదయంతో ప్రవర్తిస్తుంటే వాళ్ళ సొత్తయిన ఈ జగతిని కల్లోలపరచటానికిగాని అనుభవించటానికిగాని దానాదులు చేయటానికిగాని రాక్షసాదులకేమి హక్కుంటుంది? ఉండదు దౌర్జన్యంతో దైవశక్తి మీద తిరుగుబాటు చేయటమే వారి స్వభావం. అది వారి తామస ప్రవృత్తి. అది మదమనిపించుకొంటుంది స్వర్గాదుల మీదకీ చివరికి వైకుంఠాదుల మీదకు సైతం రాక్షసులు విజృంభించారంటే వాళ్ళ మదం ఎంతటిదో !

అంత దూరమెందుకు సామాన్యులయిన మానవుల విషయం చూస్తే చాలు తెలుస్తుంది. ఎంత అహంకారంతో ప్రవర్తిస్తున్నారో !

దీన్నే మదజ్వరం అన్నారు పెద్దలు. నేటి రాజకీయాలు ఈ మద జ్వరంతో ప్రేలిపోతున్నాయి మనమెంత మన అధికారమెంత అని ఏ ఒక్కరూ అనుకోరు. ఈ వూరికి నేను నాయకుడినని ఒకరంటే ఈ దేశానికి నేనే నాయకుణ్ణంటాడు మరొక్కడు. ఈ పరిమితమైన అశాశ్వతమైన పరిపాలనకు అధికారానికీ అదిరిపాటు పడుతున్న ఇలాంటి మద జ్వర పీడితులు, తామున్న ఈ విశాల జగత్తును పాలించి పోషిస్తున్న ఆ పరమేశ్వరుణ్ణి ఒక్కసారైనా మనసారా తల్చుకుంటారా అనిసందేహం.

)-O-(

శ్రీవాణి



# అహంకారాన్ని చంపుకోవాలి! అసూయను నిర్మూలనం చేయాలి! ఆడంబరమును అణచిపెట్టాలి!

—భగవాన్ సాయి దివ్యసందేశం

**విద్యార్థులారా ! విద్యార్థినులారా !**

ప్రకాశముగా వెలుగుతున్న జ్యోతిని చూడవలెనన్న మరొక జ్యోతిని మనం వెతుకనక్కరలేదు. అటులనే స్వప్రకాశముగా వెలుగుచున్నటువంటి యొక్క ఆత్మ జ్ఞానమును వెతుకుటకు మరొక జ్ఞానము అక్కరలేదు. ప్రతి మానవుడు కూడనూ స్వస్వరూప జ్ఞానమును కలిగినటువంటివాడే ఇట్టి దివ్యమైన భవ్యమైనటువంటి జ్ఞానతత్త్వాన్ని మానవుడు గుర్తించుకోలేక పోవటం చేతనే అన్య జ్ఞానములకై ఆరాటపడుతున్నాడు మానవుడు సృష్టిలో కనిపించుచున్న భేదములన్నీ అభేద వస్తువుయొక్క అభివ్యక్తమే భేదాభేదములకు రెండింటికినీ కేవలము ఒకే కారణము, అస్థిర పదార్థము లన్నీ కూడను స్థిరమైనటువంటి దీనిపైన ఆధారపడి ఉన్నది. సృష్టియంత కూడను ఒక నాటకరంగము సూత్రధారి, పాత్రధారి కూడను భగవంతుడే మీ అన్ని రూపములతో కూడనూ భగవంతుడే వేషము ధరించి ఉన్నాడు ప్రపంచములో గల సమస్త రూపములు కూడనూ భగవంతునియొక్క వేషములే నిన్ను ఎవరైనా తెగడినా పొగడినా భగవంతుడు ఆ రూపములో నిన్ను పొగడుచున్నాడు, తెగడుచున్నాడు అనే సత్యాన్ని గుర్తించాలి జగత్తులోని మంచి చెడ్డలన్నీ కూడనూ భగవంతుని యొక్క చైతన్య స్వభావములే. కాని, మానవుడు ఈ అంతర్ సత్యాన్ని గుర్తించుకొనలేక ఎవరో నన్ను దూషిస్తున్నారు, ఎవరో నన్ను భూషిస్తు న్నారు అని కృంగి. పొంగుతున్నాడు మానవుడు. కాదు .... కాదు .... ఆ వేషమును చూచి మీరు మోస పోకూడదు. అన్ని వేషములకు వెనకాల భగవంతుని యొక్క ప్రతిబింబమే ఈ నాటకమును ఆడించుచున్నది. ఈ సత్యం ప్రతి వ్యక్తి కూడనూ గుర్తించవలసినటు వంటిది రూపనామములు, వేషభాషలు వేరువేరుగా కనిపించినప్పటికినీ అందరూ కూడనూ ఒక్క మానవ త్వానికి సంబంధించినటువంటి వ్యక్తులే ననేటటువంటి సత్యాన్ని గుర్తించి వర్తించాలి భగవంతుడు ప్రేమ స్వరూపుడు ప్రేమయే అతని స్వభావము అందరి యందూ ఉన్నటువంటిది కూడనూ ప్రేమ ఒక్కటే భగవంతుడు తన ప్రేమను ఏ విధముగా ప్రపంచమంతయునూ ప్రకటితము గావించుచున్నాడో అట్లనే ప్రతి మానవుడు కూడనూ ప్రకటితము గావిం చాలి ఈ ప్రేమను మేథాశక్తితోగాని, ధనముతో గాని, మరి ఏ బలముతోగాని, యుక్తితోగాని పొందుటకు వీలుకాదు ప్రకాశించే సూర్యుని ప్రకాశించేటటువంటి సూర్యుని కాంతి ద్వారానే చూడాలి. అటులనే, ప్రేమ స్వరూపుడైనటువంటి భగవంతుని ప్రేమ ద్వారానే మనం పొందాలి దానికంటే మరొకటి విలువైనటువంటిది ఈ జగత్తునందు కానరాదు కాని, భగవంతుడు గుణా తీతుడు. కనుకనే, తన ప్రేమ కూడనూ గుణాతీత మైనటువంటిది కాని, దురదృష్టవశాత్తు ఈనాటి మానవుని యొక్క ప్రేమ గుణముతో కూడినటు వంటిది కావటం చేతనే రాగద్వేషములకు అవకాశం

అందిస్తున్నాడు. కనుక ఒక విధమైనటువంటి ప్రతిఫలాపేక్షతో మనం ప్రేమించకూడదు. ప్రతిఫలాపేక్షతో కూడి ప్రేమించినటువంటి ప్రేమ ఒక వ్యాపారముగా తోస్తున్నది. ప్రేమ వ్యాపార సంబంధమైనటువంటిది కాదు. ఇది కేవలము అప్పు ఇవ్వటము అప్పు తీసుకోవటం కాదు. అర్పితము కావటమే ప్రేమ యొక్క లక్ష్యం. ఇట్టి పవిత్రమైన ప్రేమను మనం పొందవలెనన్న పవిత్రమైనటువంటి భావము చేతనే మనం దీనిని పొందాలి. ప్రేమ ఒక దిక్సూచికము వంటిది. ఈ దిక్సూచికము అనేటటువంటిది ఎక్కడ పెట్టిన దీని ముల్లు ఉత్తరదిశకే చూపుతుంది. అదేవిధముగనే, మానవుని యొక్క ప్రేమ ఎట్టి పరిస్థితుల యందైనా కూడనూ భగవంతుని పైపే దీనిని మరల్చాలి

అదియే నిజమైనటువంటి ప్రేమ. కష్టమునకు, దుఃఖమునకు, విచారమునకు క్రుంగటమూ, ఆనందమునకు, ఆహ్లాదమునకు, ఆదాయమునకు పొంగటము ఇది ప్రేమ యొక్క లక్షణము కాదు. ప్రేమకు తన, పర అనేటటువంటి భేదములు లేవు మానవుడు ధనమును ఏ వ్యాపారము చేతనో, ఏ ఉద్యోగము చేతనో సంపాదించినట్లుగా, మానవుడు తన ప్రేమ ప్రకటితము ద్వారానే ప్రేమను సంపాదించాలి కనుక, ప్రేమ అనేటటువంటిది కేవలము ఇట్టి మార్గములో అట్టి మార్గములో సాధన సల్పిన లభ్యమగునని భావించటము ఇది కేవలం ఒక బలహీనతే సాధనలచేత లోకసంబంధమైనటువంటి యొక్క ఫలితమును సాధించవచ్చునే కాని దైవసంబంధమైనటువంటి ప్రేమతత్త్వాన్ని ప్రేమ చేతనే సాధించాలి. కనుకనే భగవంతుని యొక్క ప్రేమతత్త్వాన్ని ఇట్టిది అట్టిది అని కూడనూ ఎవరూ వర్ణించుటకు భాష లేదు. ఇది కవిత్వమునకు అతీతమైనటువంటిది. కనుకనే "భావాతీతం త్రిగుణరహితం" అని అన్నారు. నీటిలో పూర్తిగా మునిగి ఉన్నటువంటి వ్యక్తి ఎవ్వరితో కూడనూ మాట్లాడలేడు. కొంత వరకు నీటిలో మునిగి ఉన్నప్పుడు కొంతవరకు మాట్లాడటానికి వీలవుతుంది. కనుక, ఈనాడు లోకంలో భగవంతుడిని గురించి ఇట్టిది, అట్టిది, ఇట్టివాడు, అట్టివాడు అని చెప్పటము కేవలము ఇది సంపూర్ణంగా ఆనందాన్ని అనుభవించనటువంటి వ్యక్తులు బోధించేటటువంటి బోధనలే. ఇవి పైపై తేలేటటువంటి వ్యక్తుల బోధనలే కానీ నిజముగా భగవంతుని ప్రేమ తత్త్వాన్ని చవిచూచినటువంటి వ్యక్తులు వర్ణించ వీలు కాదు కనుకనే, వేదము "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసః" మనస్సుకు కాని, వాక్కునకు కాని అతీతమైనటువంటిది భగవంతుని ప్రేమ. ఈ ప్రేమ తమోగుణమునకు కాని, రజోగుణమునకు కాని, సాత్త్వికగుణమునకు కాని సంబంధించినటువంటిది కాదు తమోగుణమువలె ఇది మొరటైనటువంటిది కాని మొద్దుబారినటువంటిది కాని కాదు. లేక రజోగుణమువలె ఉద్రేకముతో కూడినటువంటిది కాని లేక క్రోధముతో కూడినటువంటిదికాని కాదు. సాత్త్వికమువలె చల్లగా, మెల్లగా నుండెడినటువంటిది కాదు.

గుణమునకు ఈ ప్రేమను ఏ విధముగాను పోల్చుటకు వీలుకాదు. కనుక, భగవంతుని యొక్క ప్రేమ నిర్మలమై, నిశ్చలమై, నిస్వార్థమై ఉండేటటువంటిది. కనుకనే 'నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్య శుద్ధ బుద్ధ యుక్త నిర్మల స్వరూపిణం' అన్నారు భగవంతుని ప్రేమను. ఇట్టి పవిత్రమైనటువంటి ప్రేమ తత్త్వాన్ని ప్రతి వ్యక్తి కూడను గుర్తించటానికి ఎంతైనా ప్రయత్నించాలి. ప్రాచీన పురుషులు ఇట్టి పవిత్రమైన ప్రేమనే 'ఆత్మ – ఆత్మ' అని ప్రబోధిస్తూ వచ్చారు. 'ఆత్మ' వేరు భగవంతుని 'ప్రేమ' వేరు కాదు. ప్రేమయే ఆత్మ, ఆత్మయే ప్రేమ. కనుకనే, ఇట్టి భగవత్ స్వరూపమైనటువంటి ఈ ప్రేమ తత్త్వాన్ని ప్రతి మానవుడు కూడనూ గుర్తించటం అత్యవసరం ఆ ప్రేమ యొక్క అంశే మానవుని యందు ఉంటున్నది. ప్రతి మానవుని యందు కూడనూ ప్రేమ లేనటువంటి మానవుడు కనిపించడు. కనుక

ప్రేమలేని జీవితము కేవలము నిర్జీవమైన జీవితమే. కాని దురదృష్టవశాత్తు ఈనాడు పవిత్రమైనటువంటి ప్రేమను విస్మరించి దీనికి విరుద్ధమయినటువంటి యొక్క ద్వేషము, అసూయ, డంబము, ఆశలు ఇట్లాంటి దీనితో మానవుడు ప్రవర్తిస్తున్నాడు. కనుక ఈ ప్రేమతత్త్వాన్ని చక్కగా గుర్తించుటకు ప్రయత్నించాలి ఇది మానవుని యందు మాత్రమే కాదు పశు పక్షి మృగాదులందు కూడనూ ఈ ప్రేమతత్త్వ ముంటున్నది. కనుకనే "ఈశావాస్య మిదం జగత్" జగత్తు అంత కూడనూ ఈశ్వర స్వరూపమే. ఆ ప్రేమయే ఈశ్వరతత్త్వము ఇట్టి సర్వత్రా వ్యాపించి నటువంటి యొక్క ప్రేమతత్త్వాన్ని మానవుడు గుర్తించుకొనలేకపోతున్నాడు ఈనాటి మానవునకు ధనమే ప్రధానము, పదవే ఆధారము. కాని, ధనము, పదవి - ఇవి కేవలము క్షణికమయినటువంటివి. ప్రేమ లేని హృదయము పాషాణ హృదయము. ప్రేమలేని హృదయము కఠిన హృదయము. హృదయం లేని వారికి ఎన్ని విద్యలు నేర్పి ఏమి ప్రయోజనము ?

" చదువు వలన లేదు
తర్కశాస్త్ర వాదమునందు లేదు
ప్రాకృతమైన తెలివితేటలందు లేదు
వివిధ మతములందు లేదు
వేద వాదములందు లేదు
కలదు...కలదు...ఒక్క జాలిహృదయమందె"

కనుక, ఆ జాలి హృదయమనేటటువంటిది, ప్రతి మానవునికి అత్యవసరము ఈ జాలి హృదయము లేనటువంటి మనస్సు ఎన్ని చదువులు చదివి ఎన్ని పదవులను ఏలి, ఎన్ని విధములైనటువంటి ధనమును ఆర్జించినప్పటికీ ప్రయోజనమేమి ?

విద్యార్థులారా !

మీరు పదవులను ఆశించవచ్చు ధనమును ఆశించ వచ్చును కానీ అన్నిటికీ మూలాధారమయినటువంటి యొక్క భగవత్ ప్రేమను మొట్టమొదట ఆర్జించాలి, అర్థము చేసుకోవాలి. అన్ని మార్గములందు కూడనూ ఈ ప్రేమ తత్త్వాన్ని ప్రకటితం గావించాలి.

"అహంకారము, అసూయ, ఆడంబరము"— ఈ మూడింటి యొక్క రాక్షసుల చేతిలో ఈనాడు మానవుడు చిక్కబడి ఉంటున్నాడు. ఈ మూడు రాక్షసుల నుండి ఏనాడు తప్పించుకొనునో ఆనాడే వాడు నిజమైన మానవుడు అవుతాడు. కాని, ఈనాడు భక్తి, భక్తి.... భక్తి.... అని అంటున్నాడు. ఏమిటి ఈ భక్తి ? కేవలము రాగ, తాళ, శృతులతో కూడినటువంటి భజనా భక్తి? యోగము.... యోగము.... అంటే ఏమిటి యోగము ? ముక్కు మూసుకొని మూలకూర్చొటమా యోగము జ్ఞానమంటే ఏమిటి ? అనేక గ్రంథములు చదివి ఏదో దానిలో ఉన్నటువంటి శ్లోకాలు కంఠస్థం చేసుకొని వల్లించటమా జ్ఞానము ? సన్న్యాసమంటే ఏమిటి ? కాషాయవస్త్రము ధరించుట మాత్రమే సన్న్యాసమా ! కాదు....కాదు.... 'భక్తి' అనగా రాగ ద్వేష అసూయాదులకు రహితమైనటువంటిది, అతీతమైనటువంటి యొక్క ప్రేమతత్త్వమే నిజమైన భక్తి. భక్తి.... భక్తి.... అని ఏ మానవుడు అహంకారముతో విర్రవీగుతున్నాడో, అసూయతో జీవిస్తున్నాడో, ఆడంబరముతో బ్రతుకుతున్నాడో, వాడు భక్తుడే కాదు. ఇలాంటివాని సమీపానికి కూడనూ ఈ భక్తి ప్రవేశించదు. ఈ మూడింటి యొక్క అతీతమైన స్థితికి తాను వెళ్ళి ప్రశాంతమైనటువంటి యొక్క ఆనందంతో ప్రేమించాలి. భగవంతుణ్ణి అప్పుడే " నిత్యానందం, పరమసుఖదం, కేవలం, జ్ఞానమూర్తిం, ద్వంద్వాతీతం, గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం, ఏకం, నిత్యం, విమలం, అచలం, సర్వజీవి సాక్షీభూతం" ఆ స్థితియందు ఉండినటువంటిదే 'భక్తి' అని పిలిపించుకోవటానికి వీలవుతుంది. ఇంక యోగమంటే ఏమిటి ? ఏదో హఠయోగమని, క్రియాయోగమని ఇంక Trancedential Meditation అని ఏమేమో కొత్త పేర్లు

పెట్టుకొంటున్నారు. అదికాదు యోగము "యోగః చిత్త వృత్తి నిరోధకః" ఇంద్రియనిగ్రహమే నిజమైన యోగము. ఏ విధమైనటువంటి ఉద్వేగానికి ఉద్రేకానికి గాని అవకాశమునందించకూడదు. ఇతరులు మనలను పొగిడినా తెగిడినా కూడనూ మనము ఏమాత్రమూ పొంగక, క్రుంగక ఉంటుండాలి. ఇట్టి ఇంద్రియ నిగ్రహమే నిజమైన యోగము. ఇంక జ్ఞానమనగా ఏమిటి ? 'అద్వైత దర్శనం జ్ఞానం' నా ఆత్మయే సర్వ భూతముల యందు కూడానూ ప్రతిబింబిస్తున్నదనేటటువంటి ఏకాత్మభావమే నిజమైన భావము ఇక సన్యాసమంటే ఏమిటి ? కేవలము 'గుణము మారాలికానీ గుడ్డలు మారితే ప్రయోజనం లేదు. మనస్సు మారాలి కాని, మనిషి మారితే ప్రయోజనం లేదు' కనుకనే, తాను సర్వేంద్రియములను అరికట్టి, సర్వసంగ పరిత్యాగి అయినటువంటివాడే సన్యాసి ఈనాడు సన్యాసులకున్నన్ని ఆశలు గృహస్థునకు కూడా లేవు. దేనికి ఈ ఆశలు ? ఎవరికోసం ఈ ఆశలు ? "ఇదంతా తొమ్మిది చిల్లుల తోలు తిత్తియే కాని కాంతి కల్గిన వజ్రఘటము కాదు. నిమిష నిమిషమునకు నీరులూరునే కాని పునుగు జవ్వాజీలు పుట్టబోవు. 'కడుపులోన మలము కడమెల్ల ఎముకలు తరచిచూడ పైన మురికి తోలు' కనుక మరణమునకు భయపడరాదు అభివృద్ధికి పొంగిపోరాదు. ఏమిటి ఈ అభివృద్ధులు ? మరణాలు ? ఇవి కేవలము జీవితములో తరంగాలు. సముద్రములో నుండి వచ్చేటటువంటి తరంగముల వంటివి పుట్టిన దానికి చావు తప్పదు. కనుకనే ఈ రెండునూ సహజమైనవే కాని దీనికి మనము విచారించనక్కరలేదు. అయితే, ఈ ప్రాకృతమైన జగత్తునందు, ఈ భౌతికమైన జగత్తునందు, ఈ లౌకికమైన జగత్తునందు, జీవించునంతవరకు కూడనూ Ideal boy, Ideal girl మంచి ఆదర్శవంతమైనటువంటి జీవితంగా మనం జీవించాలి. కాని ఈనాటి విద్యార్థినీ విద్యార్థులు ఈ భౌతిక ప్రభావమునకు మునిగి, ఈ లౌకిక వాంఛలలో మునిగి కేవలము తాత్కాలికమైన జీవితము గడిపే నిమిత్తమై కృషి చేస్తున్నారు. చదివిన చదువులు దేని నిమిత్తం ? పొట్టకూటికా ? కాదు.... కాదు ... పొట్టకూడు కూడా అవసరమే ! కాని చదివిన చదువును పదిమందికి ఆదర్శవంతమయినటువంటి మార్గములో దీనిని అందించటానికి ప్రయత్నించాలి "సద్గుణంబులు, సద్బుద్ధి, సత్యనిరతి, భక్తి, క్రమశిక్షణ, కర్తవ్యపాలనములు నేర్పునదే విద్య విద్యార్థి నేర్వవలయు"

భారతదేశమునందు అతిలేతవయస్సునందే అద్వైత సిద్ధాంతమును ప్రకటించి, స్థాపించి అద్వైత ప్రబోధములను బోధించినటువంటి ఆదిశంకరులవారు కేవలము జ్ఞానమే ప్రధానము జ్ఞానము వలననే మోక్షము అన్నారు. 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని అన్నారు శివానందలహరిని వ్రాసి జ్ఞానమొక్కటే మానవుడు తరించటానికి మార్గం అని అన్నాడు. ఆనందలహరిని లిఖించి మానవుని యొక్క లక్ష్యము ఆనందమే. ఆనందమునకు భగవంతుడే కారణము. రెండవ వస్తువు లేనేలేదు. 'ఏకం ఏవ అద్వితీయం బ్రహ్మ' అన్నాడు ఇంత అద్వైత సిద్ధాంతాన్ని బోధించినటువంటి ఆదిశంకరులకే తిరిగి భక్తి అవసరమయింది. ఈభక్తిలో ప్రవేశించక ఏ జ్ఞానాన్ని కూడనూ మనం పొందలేము.

యోగముకానీ, భోగముకానీ, మరే విధమైనటువంటి సాధనలుకానీ చేసి ప్రయోజనంలేదు "భజగోవిందం ! హరిని భజించు ! దైవాన్ని చింతించు ! అదియే నిన్ను తరించటానికి రాజబాట" అని శంకరుల వారు కూడనూ, కట్టకడపటికి భక్తిలో ప్రవేశించారు భక్తిని మించినటువంటిది మరొకటి లేదు ఎన్ని విధములైనటువంటి విద్యలు చదివినప్పటికినీ ఈ ప్రేమ తత్త్వమనే ఈ రసామృతమే లేకపోయిన ఇవన్నీ కూడనూ వ్యర్థమైనటువంటివే అవుతాయి. రసములేని ఫలము వలె, ఫలమివ్వని వృక్షము వలె, వాసనలేని పుష్పము వలె, పుట్టి గిట్టి ఏమి ఫలము ? నీ పుట్టుక యొక్క ప్రధానమైనటువంటి కర్తవ్యాన్ని, కారణాన్ని గుర్తిం

(తరువాయి 33 వ పేజీలో)

# మతమావశ్యకమా ?

-శ్రీ శివచిదానంద భారతీస్వామి
సిద్ధేశ్వరి పీఠాధిపతి, కుర్తాళం

ఇటీవల కాలములో ప్రభుత్వములు కోటానుకోట్ల రూపాయలు సమాజ శ్రేయస్సు కొరకు, సత్ఫలితములను సాధించు ప్రయత్నములలో కొన్ని రంగములకు ఖర్చు చేయుచున్నప్పటికి ఫలితములు మాత్రము నిరుత్సాహ జనకముగా ఉన్నవి. కుటుంబ నియంత్రణ, నేరనిరోధకము సామాజిక వనములు క్రూరమృగముల సంరక్షణ, పక్షుల ఆవాసము, జలకాలుష్యము, వాతావరణ కాలుష్యము అనేకానేక ప్రకృతి సిద్ధమయిన జీవ జంతువుల పరిరక్షణకై దేశీయ వనరులన్నియు వెచ్చించి, ప్రభుత్వ యంత్రాంగమంతయు వాటికోసమే అహర్నిశలు పనిచేయుచున్నప్పటికి ఫలితములు మాత్రము వ్యయపరచుచున్న ధనమునకు సరిపడు నిష్పత్తిలో లేవు. అందువలన ఆయా కృషిలో నిరుత్సాహకర మూల కారణములను పరిశీలించవలసియున్నది. ఆ లోపము తెలుసుకున్న వెంటనే నిర్ద్వంద్వముగా సంస్కరించుకొనిన ఫలితములు శ్రమరహితముగా సాధించుకొనవచ్చును.

పైన వివరించిన అంశములు అన్నియు ఒకటి వెనుక మరియొకటి గురించి శ్రద్ధ తీసుకోవలసిన ఆవశ్యకత గురించి 3, 4 వ దశాబ్దములనుండి వాటి పరిరక్షణ ఇహంశ ప్రచారము చేయబడుచున్నది మన పూర్వులు ప్రకృతి సిద్ధమయినవనరులను సంరక్షించుకొనుటలో మానవకృషి ప్రభుత్వ యంత్రాంగము, శాస్త్రీయ పరికరములు మాత్రమే సరిచేయలేవని గ్రహించి, ఆ లోపములన్నిటిని సవరించుటకు మతమును ప్రవేశపెట్టినారు.

మతమనగా విశ్వాసము విశ్వాసమునకు ఎల్లలులేవు యావత్ చరాచర జగత్తు, యావత్ మానవాళి, జీవ జాలము, పరస్పర విశ్వాసము చేతనే భద్రతలో మనుగడ సాగించగలిగినది. ఇటీవల ఆ మతమనే విశ్వాసము అనాగరికమని, అది వ్యక్తిగతమని, సామాజిక ప్రయోజనమునకు దాని అవశ్యకత లేదని, తృణీకరించుట మొదలెట్టినప్పటినుండియును, ఆనాటి కానాడు వరాశి మనుగడకే ముప్పు వాటిల్లుచున్నదని నాగరిక సమాజము ఘోషించుచున్నది. కొన్ని ముఖ్య అంశములను మతము ఎటుల పరిష్కరించినదో సూక్ష్మముగా పరిశీలించెదము ఉదాహరణకు....

## 1. కుటుంబ నియంత్రణ

కుటుంబ నియంత్రణ గురించి మతము ఏమి వ్యయ పరచకుండా ఎట్టి సత్ఫలితములు సాధించినదో పరిశీలించెదము స్త్రీ పురుషాదులు విశృంఖల లైంగిక జీవనము అరికట్టలేక సంతాన నిరోధక ప్రక్రియలను అమలు జరుపవలసినదిగా ఎంత ప్రోత్సహించినప్పటికి ఊహించిన ఫలితములు పొందుటలేదు. మతము ఆ రంగములో సత్ఫలితములను సాధించుటకు స్త్రీ. పురుషాదులు లైంగిక క్రియా నిరోధమునకు నిషిద్ధ తిదులు, వారములు, పండుగ దినములు, పితృ దైవ దినములు వగైరా నిషేధములు ఏర్పరచి, ఆ నిషేధములు అతిక్రమించినచో పాపము అనే భీతి కలిగించి ఆ కారణంగా వారలలో మనోనిగ్రహము పెంపొందింపచేసినారు దాని వలన శరీర ఆరోగ్యం, మనోనిగ్రహము వృద్ధిఅగుటయే కాకుండా, సంతానోత్పత్తి కూడా నియంత్రణ చేయబడినది. మతమనే విశ్వాసము మాత్రముననే అట్టి ఫలితము సులువుగా సాధించగలిగినారు మరియొక ఉదాహరణ –

## 2. నేర నిరోధము

ప్రభుత్వములు నేరములు జరుగకుండా నిరోధించుటకు గాను, సమర్థవంతమయిన యంత్రాంగమును ఆధునిక విజ్ఞానముతో మేళవించి, విస్తరించుచున్నప్పటికి ఆనాటికానాడు నేర ప్రవృత్తి పెరుగుచునే యున్నది ప్రభుత్వయంత్రాంగములను కూడామభ్యపరచి,ఆధునిక పద్ధతులలో నేరముచేసి శిక్షపడకుండా సమాజములో లజ్జా రహితముగా జీవించుచున్నారు. కాని మతము ఆ రంగములో మానవ యత్నము చాలదని ఒక విశ్వాసమును నేర నిరోధమునకు ప్రవేశపెట్టినది. అది ఏమన ఈ భూమిపై ఎన్ని ఘోరములు చేసి, శిక్ష నుండి తప్పించుకోగలిగినను మరణానంతరము మరియొక లోకమునకు ఈ జీవుడు తరలింపబడునని, ఆ లోక నాథుడయిన యముడు, తన సిబ్బందిలో ఒకడయిన చిత్రగుప్తుడు తయారుచేసిన నేరముల పట్టికను పరిశీలించి, కాగిన నూనెలో వేయించుట, కాలుచున్న ఇనుప స్థంభములను కౌగలించుకొనుట లాంటి ఘోరమయిన మరియు భయంకరమయిన శిక్షలకు గురిచేయుననే భీతిచే నేర ప్రవృత్తి నుండి దూరమై జీవుడు సత్ప్రవర్తకుడు అయ్యేడివాడు వర్తమానములో యముడు,చిత్రగుప్తుడు యమలోకము అచ్చటి శిక్షలు అనాగరిక విశ్వాసమని, అవహేళనకు గురిచేసి, విశ్వాసమును సడలింపు చేసినందున ప్రభుత్వ యంత్రాంగము సమర్థవంతముగా నేర నిరోధము చేయలేకున్నది. అదియును గాక ఆ శిక్ష భీతిచే దుష్ప్రవర్తన విడనాడి, సత్ప్రవర్తకుడు అయినచో స్వర్గాది ఇంద్రలోకములకు జీవుడు మరణానంతరము చేరునవియును, అచట స్వర్గ సుఖములు తరగని భోగభాగ్యములు అనుభవించవచ్చుననే విశ్వాసముతో త్యాగము, సేవ, ప్రభుత్వమందు విశ్వాసము, గురువుల యందు భక్తి పెంపొందించుకొని జన్మ లక్ష్యమయిన శాశ్వత సుఖ భోగములను పొందుటకు, స్వర్గారోహణము చేయుటకు ప్రబలమయిన కృషి చేయుచున్నాడు.

## 3. సామాజిక వనములు

ప్రభుత్వము ఇటీవల శక్తియుక్తులన్నియు వ్యయపరచి అరణ్యములను, వనములను, వృక్షములను సంరక్షించుటకు ఎంతయో శ్రమించుచున్నది. ఎప్పటికప్పుడే వృక్షములను నాటి, వనములను అభివృద్ధి చేయమని ప్రోత్సహించుచూ, ఆ పథకములు అమలు జరుపుటకు, అటవీ రక్షకభటుల సంఖ్యను పెంపొందించుట, వనములు నాటుటకు ధనము, మొక్కలు ఉచితముగా ఇచ్చుట, ప్రతి ఖాళీ ప్రదేశములోను వృక్షములను పెంచవలసినదని, వృక్షములు నశించినచో వర్షములు ఉండవని, పంటలు నీరులేక జీవరాశి అద్యతనభావిలో సృష్టి నశింపగునని, వాస్తవ విషయములను ప్రచారము చేయుచున్నప్పటికి ఫలితము శూన్యము. ఉదయము నాటిన మొక్క సాయంత్రమునకు కనబడదు. వృక్షములు నరుకుట ఇంకను పెరిగిపోయినది. యావత్ ప్రపంచమునకు ఇది యొక సమస్య అయినది. మతము ఒక అద్భుతమయిన విశ్వాసమును ప్రవేశపెట్టెను. ఈ జీవుడు అనేక జన్మార్జిత సుకృత, దుష్కృత కర్మల ఫలితముచే పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఎనభై నాలుగు లక్షల జీవరాశులలో భాగమయిన వృక్షరూపములో కూడా జన్మ ఎత్తునని మతవిశ్వాసము కలిగించునందున ఏ వృక్షములో మరి ఏ మొక్కలో మన పూర్వులు ఉన్నారో అనే భీతిచే చెట్టును కొట్టుటకు సంకోచించవలసి యున్నది. మరియును ఉదయము వికశించి, సాయంత్రము ఒడిలి రాలిపోయే పువ్వులు కోయుటకు కూడా, ఆ పూల మొక్కను ప్రార్థన చేసి నీకు "నీ పూవు కోయడం రీత్యాఘాత కలిగించుచున్నాను, ఇది నా కోసం కాదు భగవతారాధనకు, నన్ను క్షమించి, అనుమతి ప్రసాదించమని" ప్రార్థన నియమించినారు. ఆ ప్రార్థన ఆ పూల మొక్కలకు అర్థమయినదా లేదా అన్నది కాదు ప్రశ్న. ఒక పువ్వును కోయుటకు కూడా సంకోచించే పరిస్థితి మానవునికి కలిగించుటకే ఆ

ప్రార్థన ఏర్పాటుచేయబడినది. పూవు కోయుటకే అంత ఆలోచింపవలసి వచ్చినచో పెరిగి పెద్దదయి సమాజమునకు, తనకు బహుళ ప్రయోజనకారిగాయున్న చెట్టుని ఏల నరకగలడు?

## 4. క్రూరమృగముల సంరక్షణ

అరణ్యములలో తిరుగాడు క్రూరజంతువులు మానవ మనుగడకు అనేక సందర్భములలో ప్రమాదభరితముగా యున్నవి. అవి ప్రమాదకారులని చంపివేయుట మానవునికి ఎంతవరకు హక్కు కలదు? ఆ క్రూర మృగములు కూడా ఈ సృష్టిలో ఒక భాగమే కదా! వాటికి మనుగడకు భద్రత కావలెను కదా! మానవుడు మృగ వేటతో పాశవిక ఆనందమును పొందుచున్నందున ఆ జాతి ఆ వ్యవధిలో నశింపగుచున్నవి. ఒక జంతు ప్రదర్శన శాలలో భద్రపరచబడిన ఒక జంతువు ఒక పిల్లను ప్రసవించినచో టి. వి. లో, రేడియోలో ప్రముఖముగా ప్రచారము చేసి, జాతీయ అంతర్జాతీయ స్థాయి సంఘటనగా ప్రచారము చేయుచున్నారు. అయినప్పటికి వాటి శాతము తగ్గుచునే యున్నది మతము వాటిని సంరక్షించుటకు, భద్రత కల్పించుటకు ఒక సున్నిత మయిన ముద్రవేసెను ఆ క్రూరజంతువులన్నియు మన ఆరాధ్య దైవముల వాహనములగానో, అవతార రూపములగానో చిత్రీకరించినందువలన వేటకు వెళ్ళిన మానవునికి, వేట మృగముగా కనబడక తాను ఆరాధించే దేవతామూర్తి వాహనముగా కనబడుచున్నందున దానిని చంపుటకు సాహసించలేకపోయినాడు. దానికి మూలాధారము మతమనే విశ్వాసమే కదా!

అటులనే పక్షులను కూడా దేవతలకు వాహనములుగా చేసినవి. మరియును మన పురాణ ఇతిహాసములలో పక్షులు, మృగములు సత్ఫలసాధనకు, మానవ రూప ధారులయిన దేవతామూర్తులకు ఎటుల సహకరించినవో కథలు, సన్నివేశములు కలవు అందుచేతనే ఆయా జీవులు కాలపరిణామ దశలో నశింప అయినవేమోగాని, మానవ దౌష్ట్యముతో కాదు.



అటులనే విష సర్పములు కూడా మానవ మనుగడకు భయము కలిగించినప్పటికి, వాటి బారి నుండి మానవుడు తప్పించుకునే ప్రయత్నించవలసినదే కాని, వాటిని సంహరించుటకు అధికారము లేకుండా చేసినారు. ఇప్పుడు పాముల చర్మములు విదేశములలో గిరాకీగా యున్నవని కనబడిన పామునెల్ల నిర్దాక్షిణ్యముగా చంపి ఎగుమతి చేయుచున్నారు. వాటికి ప్రస్తుత సమాజములో ఎంత మాత్రము భద్రతలేదు అది కూడా ఈ భూమిపై జీవించు హక్కు కలిగించవలెనుకదా అందుకుగాను ఆ జాతిని పెంపొందించుటకు కోట్లాది రూపాయలు వ్యయ పరచి పాములకు ఆవాసము ఏర్పరుచుచున్నారు. అయినప్పటికి సంఖ్య పెరుగుటలేదు. వాటి భద్రతకు ఒక దేవతామూర్తిగానో, సుబ్రమణ్యేశ్వరస్వామిగానో, ఒక ఆరాధ్య దైవముగానో కల్పము ఏర్పాటుచేసి, ఒక ప్రత్యేక తిథిరోజుననాడు పుట్టలో పాలు పోయించుట, పూలతో పూజించుట వగైరా మత పరమయిన కార్యక్రమము ఏర్పాటు చేసి, విష సర్పములలో కూడా దైవ

# శ్రీ సాయి సన్నిధి చేరు కాంక్ష

నిత్యనూతనమైన సత్యసనాతన
వేదాంతసూత్ర సంవేద్య
నిష్ఫలసలులేని నేటి భక్తులకంత
సులభ గోచరుడంచు తెలియవచ్చె
మహిమలద్భుతములు మాయాపవారణాలు
భావాలకందని వైభవాలు
నేతవై జగదేక మాతవై పూర్ణుడై
వాంఛ సంభూతుడై వచ్చినావు
ఆకృతిని దాల్చివచ్చిన యాత్మ వీవె
పూజలర్పింతు గొనుమయ్య పురుషవర్య
పాడుకొందు నీ లీలలన్ పరవశించి
హృదయపుష్పాంజలువియె
సాయీ మహేశ !

**- పంచాంగము శీనప్ప శాస్త్రి**

మును చూడగలిగే విశ్వాసమును మతము ఏర్పాటు చేసినది పుట్టలో పోసిన పాలు పాములు త్రాగు చున్నవా ? లేదు. అవి మట్టిపాలే ! దాని లక్ష్యము పాలు వృధా పరుచుట కాదు పాములను రక్షించుటయే పరమ లక్ష్యం.

ఇప్పుడు ఎచట చూసిన, ఏది విన్న జల, శబ్ద, వాయు కాలుష్యములు నివారించవలసినదిగాను, లేకున్నచో ఈ మానవజాతి ఒకటి, రెండు దశాబ్దములలో నశింపు అగునని బహుళ ప్రచారము ప్రభుత్వములు చేయుచున్నవి. మానవుడు తన స్వార్థము కొరకు ప్రకృతి ప్రసాదించిన పంచ భూతములను కాలుష్య పరిచే తాత్కాలిక లబ్ధి పొందుటకు కాలుష్యం చేయుచు, ఆ కాలుష్యము వలననే తాను తన సంతతి నశింప అగునని, గుర్తించలేకుండాయున్నాడు వాటిని నిరోధించు టకు ఎన్ని చట్టములు చేసిన, ఎంత ప్రచారము చేసినా సవరింపబడుట లేదు. దానికి మూల కారణము మానవ మేధనుండి విశ్వాసమును దూరము చేయుటయే మన మతము అట్టి కాలుష్యమును నివారించుటకు పంచభూతము లను, దేవతలను చేసి, వాయుదేవుడుగాను, వరుణ దేవుడుగాను, జలదేవతగాను, భూమాతగాను, అగ్ని దేవతగాను భావించి వాటిని ఆరాధనీయ దేవతలుగా చేసినందున పంచభూతములు కలుషితము చేయకుండా నిరోధించుటకు సరళ మార్గము ఏర్పాటుచేసినారు. అన్ని జీవులలోను భగవంతుడు ఉన్నాడు. నీలోనూ ఉన్నాడు. అన్నందున అన్ని జీవులకు దైవత్వము కల్పించినాడు.

పైన వివరించిన సామాజిక బుగ్మతలన్నియు నివారింపబడవలె నన్నచో మతము యొక్క ఆవశ్యకత గుర్తించవలసిన తక్షణ కర్తవ్యమైనది మతము అనగా ఎల్లరకు సమ్మతమయినదే మతము. మతము సర్వ కాలీనము సర్వ ప్రాంతీయము, సర్వజనీయకము అనే ప్రబల సత్యమును గుర్తించవలసిన ఆవశ్యకత మానవ మనుగడకు తక్షణ కర్తవ్యం, మతమును ఏ రూపము లోను అవహేళన చేయరాదు. మతము దానియొక్క విస్తృతిని నియంత్రణచేయుటకు ఎవ్వరూ ప్రయత్నించ రాదు. మత పెద్దలు, వారి వారి సాంప్రదాయసిద్ధ విశ్వాసములను, ధర్మములను, విశేష ప్రచారము ఒనరించుటకు చక్కటి వాతావరణము కల్పించవలసి యున్నది. మతాచరణ నేరముగా భావించే రోజులు ఇకముందు ఉండరాదు. ఈ యావత్ సృష్టి మనుగడకు మతము ఆవశ్యకమే. మతమనే విశ్వాసము అనేక కల్పముల, యుగముల కాల పరీక్షకు నిల్వగలిగినది. దాని చ్యుతి జీవజాతి నాశనమునకే కాగలదు.

)○(

# గీత - అమృతవర్షిణి

- సాయి గంగామహాదేవ్

" యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం ।
తేద్వంద్వ మోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢవ్రతాః ॥

—— పుణ్యకర్మగల యే జనుల యొక్క పాపము అంతమొందినదో వారలు ద్వంద్వ మోహముచే విడువబడినవారలై దృఢమైన వ్రతము గలవారలై నన్ను భజించుచున్నారు—— అని భగవానుని ప్రవచనము.

పాపభారము గల జనులు ఎంత కావాలనుకొన్ననూ భగవంతుని యందు దృఢభక్తిని పొందలేరు అపవిత్రమైన పాత్ర వంటకు పనికిరానట్లు పాపకర్ముల చిత్తము భక్తికి పనికిరాదు. పాపనాశనానికి పుణ్యమే సరియైన సాధన. కనుకనే పుణ్యకర్ములు పాపమును నశింపచేసుకొన్నవారలై ద్వంద్వ మోహ వినిర్ముక్తులై దృఢవ్రతులై భగవంతుని భజించుచున్నారని చెప్పటం జరిగింది ఐతే పాపమంటే ఏమిటో తెలిస్తే పాపాన్ని త్యజించవచ్చు. పుణ్యమంటే ఏమిటో తెలిస్తే దాన్ని ఆచరించవచ్చు దృఢవ్రతమంటే ఏమిటో తెలిస్తే దాన్ని అనుష్ఠించవచ్చును. కనుక వాటిని తెలిసికొందాము.

"పతతి నరకే అస్మాదితిపాప్మా— దీనివలన నరకమునందు బడుదురు. ఇది పాపము": "పాతి రక్షత్యస్మాదాత్మాన మితి పాపం— పారక్షణే— దీనివలన జనము తన్ను రక్షించుకొనును", "పిబతి పాపిష్ఠ మితి పాపం— పాపానే— పాపిష్ఠ నిగ్రసించునది పాపం" అనగా నరకహేతువైనది (అధర్మము) : తన్ను మాత్రమే రక్షించునది (స్వార్థము); హింసాత్మకమైనది పాపము "పాపాయ పరపీడనమ్" పరులకు పీడ (బాధ) కలిగించునదంతయూ పాపమే. అద్వైతపరముగా చూచిన "పర = ఆత్మ" "పీడనమ్ = భిన్నము చేయుట". పరపీడన మనగా ఏకత్వమైన ఆత్మను అనేకత్వముగా భావించి ప్రవర్తించుట. ఇదియే బహుపాపము అనేకత్వమనే ద్వైతభావన నశించిన ఏ పాపములూ లేవు. అన్ని పాపములకూ మూలము అనేకత్వ భావన యను పాపమే ఆధారము. ఇక పుణ్యమంటే ఏమిటి ?

'పుణతి శుభం కరోతీతి పుణ్యం - పుణ శుభ కర్మణి - శుభమును చేయునది పుణ్యం ' తనకును, ఇతరులకును ఏ కర్మమంగళకరమో అది పుణ్యము. అనగా సర్వానందకరమైనది పుణ్యము. 'పరోపకారః పుణ్యాయ' పరోపకారమే పుణ్యము - అని వ్యాస భగవానుల వచనము అద్వైత ప్రకారము పరోపకారమనగా ఏమిటి ? పర = ఆత్మ ! ఉప = సమీపము. కర = చేయుట. అనగా ఆత్మతత్త్వానికి సమీపంగా తన తత్త్వాన్ని కొనిపోయే పనిచేయుటయే సరైన పుణ్యము అనగా ఆత్మస్వరూపమే తానై అన్ని ప్రాణుల యందునూ తానున్నానని, అన్ని ప్రాణులూ తనయందున్నవని గుర్తించుటే నిజమైన పుణ్యము. ఈ స్థితిలో ఏ ప్రాణినీ బాధించలేడు మనిషి. అందుకే ఇదే సరైన పుణ్యము. ఇక దృఢవ్రతమనగా ఏమిటి?

'వ్రతే వర్జనే ' అను సూత్రప్రకారంగా వ్రత శబ్దమేర్పడింది. అనగా విడుచుట అని అర్థము. దుర్గుణములను, దుష్ట సంకల్పములను, దుష్టవాక్కులను, దుష్టకర్మలను, సంపూర్ణంగా పరిత్యజించుటే వ్రతము. జీవత్వాన్ని పరిత్యజించి, దైవత్వాన్ని పొందుటే నిజమైన వ్రతము. ఇదే త్యాగము. త్యాగములేక దైవత్వము ప్రాప్తించదు. కారణము త్యాగమువల్లనే జీవత్వము ప్రాప్తించినది. అందువల్ల తిరిగి త్యాగము చేతనే దైవత్వము ప్రాప్తిస్తుంది. అందుకే 'యజ్ఞో వై విష్ణుః' అన్నారు. అనగా త్యాగమే విష్ణువని అర్థము. విశ్వమంతయూ త్యాగమేనని మరొక అర్థము.

కనుక పాప రాహిత్యము; పుణ్యశీలత్వము: త్యాగానుష్ఠానము ఈ మూడింటి ద్వారానే భగవంతుని మనము పొంది ఆత్మస్వరూపులమై వర్ధిల్లగలము కాన భగవంతుడు వీటిని మనకనుగ్రహించుగాక ! శుభమ్ !

సైన్సువాణి - 3

# కాన్సర్, ఎయిడ్స్‌ల నిరోధం మన చేతుల్లో ఉందా?

-కె. ఆర్. కె. మోహన్

ఆధునిక కాలంలో వైద్యరంగం అతి వేగంగా అభివృద్ధి చెందుతోంది. ఒకనాడు మశూచి, క్షయ, టైఫాయిడ్, మలేరియా వంటి వ్యాధులు వస్తే అట్టి వారిలో బ్రతికి బట్టకట్టగలవారు అతి తక్కువ సంఖ్యలో ఉండేవారు. ఈనాడు మశూచి పూర్తిగా అంతరించింది. మిగిలిన వాటిని శాస్త్రజ్ఞులు సులువుగా అదుపుచేయ గలుగుతున్నారు. ఫలితంగా ఈనాడు ఈ వ్యాధుల మూలంగా మరణించేవారి సంఖ్య అతి తక్కువ. అయితే ఇప్పటికి కాన్సర్ వ్యాధిని జయించడం మాత్రం శాస్త్రజ్ఞులకు సవాలుగానే మిగిలింది. తొలిదశలో ఈ వ్యాధిని గణనీయంగా కుదర్చగలిగినా మలిదశలలో మాత్రం ఇది మింగుడుపడని మాత్రగానే ఉంటుంది. ఈరంగంలో ప్రపంచవ్యాప్తంగా విస్తృతస్థాయిలో పరిశోధనలు జరుగుతున్నాయి. ఇటీవల శాస్త్రజ్ఞులు సాధించిన కొన్ని ఆసక్తికరమైన ఫలితాలు కాన్సర్ వ్యాధిని అద్యతన భవిష్యత్తులో అదుపుచేయవచ్చుననే ఆశను అవి కూడ స్వల్ప వ్యయంతో సాధ్యమనే నమ్మకాన్ని కల్పిస్తున్నాయి.

"ఇంటర్ ఫెరాన్" అనే ఓషధం కాన్సర్ వ్యాధిని నిరోధించగలదు. నిజానికి మానవ శరీరంలో 'అల్ఫా ఇంటర్‌ఫెరాన్' అనే రసాయనం ఉంటుంది. ఇది మాంసకృత్తులలో ఒక రకం. ఇది శరీరంలో సహజంగా ఉత్పత్తి అవుతూ, శరీరం 'ఇన్‌ఫెక్షన్' కి గురి కాకుండా కాపాడుతుంది. ఈ అల్ఫా ఇంటర్ ఫెరాన్ పరిమాణం గణనీయంగా తగ్గిపోయినప్పుడు దేహం వ్యాధి నిరోధక శక్తిని కోల్పోయి కాన్సర్‌తోసహా అనేక వ్యాధులు రావడానికి అవకాశం ఏర్పడుతోంది జపాన్ శాస్త్రజ్ఞుల పరిశోధనల్లో పట్టుపురుగులు ఈ ఇంటర్ ఫెరాన్‌ని తయారుచేస్తాయన్న విషయం బహిర్గతమయింది. ఒక రకం వైరస్ సాధారణంగా పట్టు పురుగులకు సోకి వాటి జీవకణాలను దెబ్బతీస్తుంటుంది. ఇది ఒకసారి వాటి జీవకణాలలో ప్రవేశించక పెద్ద మొత్తంలో ఈ 'అల్ఫా ఇంటర్ ఫెరాన్' ని తయారు చేస్తుంది. ఈ వైరస్‌లోని జెనీలలో ఇంటర్ ఫెరాన్‌ని ఉత్పత్తిచేసే భాగాన్ని వేరుచేసి దానిని మానవ దేహంలోని జీవకణంలోని ఇంటర్ ఫెరాన్‌ని ఉత్పత్తిచేసే జెనీల స్థానంలోకి మార్చితే మానవ శరీరంలో అధిక స్థాయిలో ఈ ప్రొటీన్ ఉత్పత్తి కాగలదు. ఇది కాన్సర్‌ను సమర్థవంతంగా నిరోధించగలదు. ప్రాథమిక స్థాయిలోని పరిశోధనలు సత్ఫలితాలను ఇచ్చాయి విస్తృత స్థాయిలో జరుగుతున్న ఈ పరిశోధనలు విజయవంతమై కాన్సర్ వ్యాధి నిరోధంలో కొత్తశకం ఆరంభం కాగల సూచనలున్నాయి.

అసలు దేహానికి వ్యాధినిరోధకశక్తి ఎందుకు తగ్గిపోతుంది? ప్రధానంగా ఇది 'ఎక్వైయిర్డ్ ఇమ్యూన్ డిఫిసియెన్సీ సిండ్రామ్' అనే వ్యాధివల్ల కలుగుతుంది. దీనినే సూక్ష్మంగా "ఎయిడ్స్" అని అంటారు. "హెచ్. టి. ఎల్. వి. - 3" అనే వైరస్‌వల్ల ఈ వ్యాధి కలుగుతుంది. ఈ వైరస్ సంఖ్య అతివేగంగా పెరుగుతూ దేహనిరోధకశక్తి దెబ్బతింటుంది. ఎయిడ్స్ వ్యాధి విశృంఖల అక్రమ లైంగిక సంబంధాలవల్ల రక్తమార్పిడులవల్ల ప్రధానంగా వస్తుంది. అమెరికాలోని మసాచూసెట్స్ హాస్పిటల్‌కి చెందిన వైద్య బృందం 'ఆల్ఫా ఇంటర్‌ఫెరాన్'ను ఈ వైరస్ పెరగ

కుండా నిరోధించేశక్తి ఉన్న విషయాన్ని కనుగొంది. ఇదికాక 'హెచ్.టి ఎల్ .వి.-3' అనే ఒక వైరస్ వ్యతిరేక రసాయనం, ఇన్‌ఫ్లుయెంజోన్ వాడే రిచ్ వైరిన్ అనే ఔషధం, స్లీపింగ్ సిక్‌నెస్‌కి ఉపయోగించే సురామిన్ అనే మందు కూడా ఈ 'హెచ్ టి ఎల్.వి.-3 వైరస్‌ను నిరోధించగలవని తేలింది ఈ ఔషధాలన్నింటినీ సంయుక్తంగా వాడితే ఫలితాలు సంతృప్తి కరంగా ఉండగలవన్న విశ్వాసంతో ఆ దశలో పరిశోధనలను సాగిస్తున్నారు శాస్త్రవేత్తలు

అక్కడక్కడ జరిగే పరిశోధనలను కాసేపు అలా వుంచి మన ఇళ్ళలోనూ, దొడ్లలోనూ మనకు తెలియకుండానే సాంప్రదాయంగా అనుసరిస్తున్న కొన్ని విశేషాలను గమనిద్దాం.

మన హిందువుల ఇళ్ళలో వంట ఇంట్లో భోజనాలు అయిపోయాక ఇల్లు కడిగి ముగ్గుపెట్టడం పరిపాటి ఈ ముగ్గును సుద్దతోకాని, సున్నంతోకాని పెడ్తారు అలాగే సూర్యోదయాన్నే ఇంటిముందు శుభ్రంచేసి కళ్ళాపి జల్లి ముగ్గు పెట్టటంకూడా పరిపాటి. ముగ్గులు పెట్టడాన్ని మనం సాంప్రదాయంగా పాటిస్తున్నామేకాని దీని వెనక బోలెడంత శాస్త్రం ఉందని తెలుసుకుంటే వింతగా ఉంటుంది ఇటీవల శాస్త్రజ్ఞులు వంటఇంట్లో ఓ మూలగా కొంచెం సున్నాన్ని ఓ పెట్టెలోపెట్టి మూత తెరిచి ఉంచితే అక్కడి గదిలోని చెమ్మ ఇగిరిపోవడమే కాకుండా సూక్ష్మజీవులు వైరస్‌లు రావని సలహా ఇస్తున్నారు. ఈ సున్నాన్ని కొద్ది వారాలకు ఒకసారి మారుస్తుండాలట. మనవాళ్ళు వాడుతుండే ముగ్గు, సుద్ద ఈ సున్నానికి సంబంధించినవే. మరి ఎవరి సలహాను పాటించి అనాదినుంచి మనవారు ఈ సాంప్రదాయాన్ని నెలకొల్పినట్లు ? ఇంత సులువుగా సూక్ష్మజీవులను వైరస్‌లను అరికట్టగలిగితే ఎయిడ్స్, కాన్సర్ వంటి వ్యాధులుకూడా గణనీయంగా తగిపోవా ?



# సాయి గీతం-

రాయపరపు రవి

మరచి పోలేను నిన్ను
మాధవా ! (శ్రీ) సాయి !
పర్తిలోన నెలకొన్న !
పరమ పురుషా !!

నీటి తోడ దీపములను
నిలిపినావంట !
కలిమినిచ్చి దీన జనుల
కాచినావంట !
జన్మ జన్మముల నోము ఫలము నీవంట

ద్వారకామాయిలోని
షిరిడీసాయి నీవంట ! ॥మరచి॥

పర్తిలోన వెలసిన
పరమాత్మవు నీవంట !
సత్యసాయినై జగతి
నిలిచినావంట !
దీనార్తుల రోగార్తుల కాచినావంట
ఉచిత విద్యలందించే
సద్గురువే నీవంట ॥మరచి॥

# టెన్షన్ - టెన్షన్ - టెన్షన్

తూరి ప్రసన్న

ఆధునిక జీవితం అంటేనే 'టెన్షన్' అనే నిర్వచనం చేసే పరిస్థితి కలిగింది. ఇది స్పీడ్ (Speed) యుగం కాబట్టి 'వొత్తిడి' తప్పదు. Stress, Strain (ఒత్తిడి, క్లేశము) అనేవి మన యొక్క జీవితాలను వేగవంతం కావించటంలో అనుభవించవలసిన అనివార్యమైనటువంటి రెండు మానసిక స్థితులు.

ఈనాటి సమస్యలు చాలా జటిలమైనవే! పరిష్కార ప్రయత్నాలు కూడా చాలా ప్రబలమైనవే! పైగా ఈ సమస్యా పరిష్కారం తీక్షణమైనది కావాలి. పరిష్కారాన్ని వాయిదా వేశామా, అది కొండంత సమస్య అయిపోయి శాశ్వతంగా అపరిష్కృతంగా మిగిలిపోయే ప్రమాదం ఉందికదా!

కాబట్టి నేటి ఆధునిక జీవితంలో బ్రతికే వ్యక్తి ఎవరైనా సరే – 'నాకు సమస్యలు లేవు' అనేవారు ఉండటానికి వీలులేదు.

వచ్చిన చిక్కంతా 'సమస్య' లోనూ లేదు – 'పరిష్కారం' లోనూ లేదు – కానీ ఈ వేగానికి తట్టుకొనే మానసిక శక్తి లోపించటంలోనూ, ఈ సమస్యల యొక్క బరువును భరించగల మనోబలం లోపించటంలోనే వుంది! కాబట్టి ఈ యుగంలో మనం అనుభవించే గొప్ప 'ట్రాజడీ' కూడా ఈ విధమైన మానసిక శిక్షణలో మనం ముందంజ వేయకపోవటమే! ఈ అంశాన్నె శ్రీ ఎలిగ్జిస్ క్యారల్ కూడా 'Man the unknown లో బాగా Highlight చేసి చెబుతారు. వ్యాయామ శాలలో శారీరకంగా ఎలాంటి వ్యాయామ సాధన చేస్తూ ఒక విధమైన సమర్థతను పోషించుకుంటామో, మానసికంగా కూడా మనలను యెదుర్కొనే ఈ హఠాత్ పరిణామాలను సమస్యలనూ స్వీకరించి, ఏ 'టెంషను' కూ చోటివ్వకుండా బ్రతికే మానసిక సాధనను కూడా మనం బాల్యం నుంచే నేర్చుకోవాలి, అంటారు శ్రీ ఎలెగ్జిస్ క్యారల్. అలాటి టెంషన్లను యెదుర్కొనే మానసిక శిక్షణ లేకపోతే ఏమవుతుంది? ప్రతి రోజూ, ప్రతి క్షణం కూడా మనస్సుపైన ప్రసరించే వొత్తిడులు క్రమేపీ పెరిగి మనస్సును కృంగదీస్తాయి, వికలం కావిస్తాయి. చివరకు శక్తిహీనం కావించి, తద్వారా అనేకమైన మానసిక రోగాలకూ, శారీరకమైన రోగాలకు మనల్ని బలిచేస్తాయి.

ప్రస్తుతం మనం ఆధునికమైన బాహ్య జీవితపు పైపై మెరుగులు, మెరుపులు చూచి ఎంత ముచ్చట పడుతున్నా కూడా, లోలోపల ఆధునిక మానవుడు పొందే దుస్థితిని ఈ రీతిగా అవగాహన చేసుకొనక తప్పదు. టెంషను లేకుండానూ బ్రతకాలి, వేగంగానూ పోవాలి, సత్వర పరిష్కారాలతో ముందంజవేస్తూ బ్రతకాలి.

## ఈ టెంషన్‌కు విరుగుడు ఎక్కడవుంది?

టెంషన్‌కు విరుగుడు విశ్రాంతిలోనే వుందని మనకు తెలుసు. అందువల్ల టెంషన్‌వల్ల కలిగే ఈ రోగాలకు మందు కూడా మానసిక విశ్రాంతిలోనే వుంది. కాబట్టే Mind – cure ఉద్యమకారులు 'Gospel of Relaxation' అనే సూత్రాన్ని బాగా ప్రయోగాత్మకంగా అనుసరించి, పరిశీలించి, దానినే రోగ నివారణకు కూడా ఒక మూల సూత్రంగా నిరూపించారు.

అయితే ఈ 'రిలేక్సేషన్' (విశ్రాంతి పొందటం) అనే దానిని మనం ఈనాడు పొందుతూనే వున్నాంకదా! అనుకోవచ్చు. అటువంటి రిలేక్సేషన్ కాదు రోగాన్ని నిరోధించగలది! ఏమిటి మన రిలేక్సేషన్? కాసేపు క్లబ్‌లో త్రాగటం, వారానికో సెలవరోజు చీట్లపేక

తోనో, గుర్రం పందేలతోనో గడపటం, లేకపోతే ఏదో Amusement club లో బ్రేక్ డ్యాన్సు, పాప్ మ్యూజిక్సుతో Engoy చేయటం, ఏదో అశ్లీల సాహిత్యంతో కాలక్షేపం చేయటం, అంతకు తక్కువ ఏమీ కానటువంటి కేబుల్‌స్టార్ టి వి. చిత్రాలను చూస్తూ కూర్చోవటం మొదలైనవే కదా మన 'రిలాక్సేషన్' లు ఈ విధమైన రిలాక్సేషన్ ద్వారా తాత్కాలికంగానే మనకు గల 'టెంషన్'కు విరామం లభిస్తుంది కానీ, మన మనస్సులోనుంచి టెంషన్ పోలేదు సరికదా ఈ విధమైన 'రిలాక్సేషన్'ద్వారా సరికొత్త అనర్థాలు మనకు చుట్టుకున్నాయని చెప్పవలసివస్తుంది. మనస్సులో ఎప్పటికప్పుడు చెలరేగే టెంషన్ ద్వారా ఎందుకు ఆరోగ్యం దెబ్బతినేది కూడా తెలుసుకుందాం అటువంటి టెంషన్ నివారణకు సరియైన మార్గం ఎప్పటికప్పుడే టెంషన్ లేకుండా ఆలోచించటం, మాట్లాడటం, పని చేయటం. పనసకాయ తొనలను వొలిచేటప్పుడు చేతికి నూనె రాసుకొని వొలవటంచేత, చేతికి జిగురుఅంటదు నూనె రాసుకొనకపోతే చేతికి పట్టిన జిడ్డు అంత తేలికగా వదలదు. అలాగే టెంషనును అంటుకోని మనస్తత్వాన్ని అలవరచుకోవటం ద్వారా మనలో టెంషన్ ద్వారా కలిగిన బాధ్యాలు తప్పక తొలగి పోతాయనే సత్యాన్ని Mind - cure సూత్రాలలో నిరూపించారు.

అనేక విధాలుగా ఈ టెంషన్ మనల్ని పట్టుకొని పీడిస్తూ వుంటుంది.

ప్రతి చిన్న విషయానికీ కూడా కోపం తెచ్చుకోవటం (Irritability), తలనొప్పి, అలసిపోవటం, జ్ఞాపకశక్తి లోపించటం, ఆందోళన చెందటం, జీర్ణకోశ రోగాలూ, ఊపిరితిత్తుల జబ్బులు, గుండె జబ్బులు, చివరకు ఏడుస్తూ కూర్చునే అలవాటు ఈ టెంషను మనకు ప్రసాదించే శాపాలు. కాబట్టి ఈ రీతిగా సంక్రమించిన రోగాలను పోగొట్టుకొనే ప్రయత్నంలో మనం వైద్యుని దగ్గర నుంచి మందులు తీసుకుంటాం కానీ ఆ మందులు ఎంత ఖరీదువైనా మనకు సంక్రమించిన పైన చెప్పిన రోగాలను నయం చేయలేవు సరియైన మందు టెంషను నుంచి మనస్సును విముక్తపరచటంలోనే వుంది, అని మెడికల్ సైన్సు కూడా అంగీకరిస్తోంది.

ఇలాటి టెంషనుకు దారితీసే వాటిలో మనం తినే ఆహారం, మనం చేసే ఆలోచనలు, ఎంతో ప్రాధాన్యత వహిస్తాయి. టెంషను ద్వారా మన శరీర గ్రంధుల నుంచి ఎడ్రినలీన్ ( Adrenaline ) అనే హార్మోన్ వెలువడుతుంది. దానివల్ల కండరాలు బిగుసుకుపోవటం రక్తనాళాలూ, సూక్ష్మనాడులూ దెబ్బతినటం, అది కేంద్ర నాడీమండలం (Central nervous sys tem) పై దుష్ప్రభావాన్ని కలిగించటం అనేవి ఒకదాని తర్వాత ఒకటిగా కలిగే శారీరకమైన అనర్థాలు స్థూలంగా టెంషన్ ద్వారా కలిగే అనారోగ్యస్థితి యిది. టెంషన్ యొక్క తీవ్ర పరిస్థితి వల్ల పరిణామాలు కూడా తీవ్ర రూపాన్ని ధరిస్తూవుంటాయి. రెండవ ప్రపంచయుద్ధంలో ఒక యువతికి ఉరిశిక్ష వేశారుట, జర్మనీదేశంలో. 24 గంటల వ్యవధిలో ఆమెకు ఉరితీసి చంపటం అనే శిక్ష విధించారు. ఆ రాత్రి ఒక జీవిత కాలపు 'టెంషన్' ను ఆమె మానసికంగా అనుభవించింది. దానికి ఫలితంగా 80 సంవత్సరాల వయసులో సంభవించే రీతిగా ఆ రాత్రికి రాత్రి ఆమె నడివయస్సులోనే జుట్టు అంతా తెల్లబడిపోయింది ముఖం, శరీరం ముడతలుపడి ఒడిలిపోయాయి. ముదుసలిది అయిపోయింది టెంషన్ ద్వారా భవితవ్యంలోని 40 సంవత్సరాలలో కలిగే శిథిల పరిణామాలు ఒక్కరాత్రి 10 గంటల వ్యవధిలోనే ఆమెలో సంభవించాయి ఈ అంశాన్ని ఈనాటి మెడికల్ సైన్సు పత్రికలు చాలా ప్రముఖంగా వ్యాఖ్యానించాయని తెలుస్తుంది

బాహ్య ప్రపంచం అంతటా ఈనాటి జీవితం Stressతో కూడినట్టిదే! కాబట్టి ఈ బాహ్యప్రపంచం యొక్క వేగాన్ని, అది సృష్టించే సమస్యలనూ మనం మార్చలేకపోవచ్చు కానీ ఈ బాహ్యమైన వొత్తిడి ద్వారా

మనలో కలిగే ప్రతిస్పందన రూపమైన 'Strain' అనే దానిని మనం పూర్తిగా కంట్రోలు చేయగలం, అంటారు శ్రీ వి రఘునాథన్ (Stress and Strain అనే వ్యాసంలో 16-2-82 భవాన్స్ జర్నల్).

మన మనస్సులపై సమస్యలద్వారా ఎంతో వొత్తిడి, వేడి కలుగుతూవుంటాయి కానీ ఆ సమస్యలకు సముచితమైన పరిష్కారాలను, అవసరమైనంతవరకు మానసికమైన సర్దుబాటును (Mental Adjustment) మనం చేసుకోగలిగితే, సమస్య ఎంత జటిలమైనదయినా దానికి పరిష్కారం కనుగొనే సామర్థ్యం పెంచుకొంటే మనకు గల సమస్యల వొత్తిడి తొలగిపోతుంది, అంటారు శ్రీ వి రఘునాథన్.

అటువంటి సమర్థత మానసికంగా లేకపోతే, ఆ వొత్తిడి అనేకమైన రోగాలకు మూలం అవుతుంది ఒక మెడికల్ రిపోర్టు :

ఒక అమ్మాయి వుంది. ఆమెకు ఏమాత్రమూ యిష్టంలేని యువకునితో ఆమె తండ్రి ఆమె వివాహాన్ని తలపెట్టాడు. ఆమెకు మానసికమైన టెంషన్ పట్టుకుంది. బయటకు చెప్పుకోలేదు, చెప్పుకొన్నా వినేవారు లేరు. పర్యవసానంగా ఆమె ఆరోగ్యంలో మార్పులు కలిగినై. ఎక్కడ కీళ్ళు అక్కడ వాచిపోయి, పట్టుకుపోయినై. దానికి తోడు హై-టెంపరేచరు. నెల రోజులు నర్సింగ్‌హోంలో చికిత్స పొందినా ఆమెకు రోగం తగ్గటంలేదు. డాక్టర్లకు అంతుబట్టటంలేదు. 'ప్రస్తుతం ఆ అబ్బాయి వివాహానికి యిష్టపడటంలేదు', అన్నాడు తండ్రిగారు. తర్వాత రెండు రోజుల్లోనే ఆమె కీళ్ళ వాపులు పోయినై. టెంపరేచరూ నార్మల్‌కు వచ్చింది, డాక్టరు ఆశ్చర్యపోయాడు. కొంతకాలం తర్వాత మరల అబ్బాయితో ఆమె వివాహానికి సంప్రదింపులను ప్రారంభించాడు తండ్రి మరల ఆమెకు పాతరోగం పట్టుకొనగా - ఆస్పత్రిలో చేర్చారు. అప్పటికి కానీ డాక్టరుగారికి ఆమెను పీడించే రోగానికి గల కారణం తెలియలేదు " ఆమెకు యిష్టంలేని వివాహాన్ని చేసి ఆమెను మానసికంగా, శారీరకంగా ఎందుకు పాడుచేస్తావు ? '' అని డాక్టరుగారే తండ్రిని వారించాడుట.

ఇటువంటి రిపోర్టులు వైద్యచరిత్రలో ఎన్నో లభిస్తాయి ఇదొక ఉదాహరణ మాత్రమే.

## మానసికమైన ఆరోగ్యం, విశ్రాంతి ఎలా వుంటాయి ? ఒక విశ్లేషణ :

అమెరికన్ మెడికల్ అసోసియేషన్‌వారు Mental Health అనే పదానికి సరియైన నిర్వచనాన్ని సూటిగా చెప్పలేక, ఈ దిగువ సూచించిన అనేకమైన లక్షణాల యొక్క మానసిక స్వరూపాన్ని వివరించారుట !

1) Emotional Stability
(ఉద్రిక్తత చెందని సమత్వస్థితిగా దీనిని చెప్పవచ్చు)

2) **Maturity of Character**
(శీలసంపద యొక్క పూర్ణవికాసం)

3) Ability to over come the paralysing stresses of life.
(జీవితంలో ఎదుర్కొనే భయంకరమైన వొత్తిడులను కూడా అధిగమించే సమర్థత )

4) Ability to judge reality acurately
(వాస్తవిక సత్యాన్ని నిర్ణయించటంలో సునిశితమైన సమర్థత)

5) Ability to foresee and far-see; to evaluate things with far sight.
(రానున్న పరిణామాలను ముందుగానే చూడగల, భావించగల సమర్థత దూరదృష్టితో పరిస్థితులను బేరీజు చేసే శక్తి కలిగివుండటం )

6) Ability to love; Ability to sustain affectionate relationship with people around.
(తన చుట్టూవున్న వ్యక్తులను ప్రేమించగలగటం, వారితో ఆదరపూర్వకమైన అనుబంధ సంబంధా

లను చిరకాలం నిలుపుకోగల సమర్థత కలిగి వుండటం)

7) Ability to work cheerfully and productively.
(ఎప్పుడు ఆనందంగా కృషిచేసే సమర్థత— ఉత్పాదనాపూర్వకమైన కృషిని కొనసాగించే శక్తి కలిగివుండటం )

8) Ability to gratify hunger, thirst and sex urges in such a way as not to hurt other people or one self.
(ఇతరులను బాధించని రీతిలో తనకుగల ఆకలిని, తృష్ణను, లేదా లైంగిక వాంఛలనూ తీర్చుకోగల సహనం, సమర్థతలు కలిగివుండటం )

9) Having an affective conscience
(సమర్థవంతమైన అంతఃకరణశక్తిని కలిగి వుండటం)

పైన వివరించిన మానసికలక్షణాలు కలిగిన వ్యక్తికే నిజమైన మానసికమైన విశ్రాంతి (రిలాక్సేషన్) ఏమిటో తెలిసేది.

Relaxation is defined as reduction to minimum of mental and muscular energy, conducive with life అన్నారు.

మానసిక శక్తి, కండరాల శక్తి వృధా కాకుండా, ఈ శక్తిని మనలో నిలువచేసి వుంచుతూ, దానిని నిత్య జీవన సాఫల్యానికి ఉపయోగపడే విధంగా చేస్తుంది. ఈ రిలాక్సేషన్ సరియైన విశ్రాంతి అంటే అదే

ఒక పనిలో అలసట, విసుగు, అసమర్థత లేకుండా ఆనందంగా, సమర్థవంతంగా, ఎంత చేసినా విసుగు లేకుండా ఎవరైనా మునిగిపోగలిగితే అతని మానసిక శక్తికి వేరే రిలాక్సేషన్ అక్కరలేదు అటువంటివారికి ఒక పనినుంచి మరొక పనికి వెళ్ళటమే రిలాక్సేషన్. Change of work is relaxation అన్నారు. అటువంటివారికి రెస్టు అనే పదం వారి నిఘంటువులో నే వుండదు "రెస్టును అరెస్టుచేయి" అన్నారు భగవాన్ బాబా. భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు తమ దిన

" అరక్షితం తిష్ఠతి దైవరక్షితం
సురక్షితం దైవహతం వినశ్యతి
జీవత్యనాథోపి వనే విసర్జితః
కృతప్రయత్నోపి గృహే వినశ్యతి "

దేవుని రక్షణగలది మానవుని రక్షణ లేకపోయి నప్పటికి నిలిచివుండును. మానవుడెంతగా రక్షించిననూ దేవుని రక్షణ లేనిది నశించును (దేవుని రక్షణవుండుట వలన) మానవుని రక్ష లేకపోయినప్పటికీ వనములో విడువబడిన బాలుడు జీవించుచున్నాడు (దేవుని రక్షణ లేకపోవుట వలన) ఇంటిలో మానవుని చేత ఎంతగా ప్రయత్నం చేయబడినప్పటికినీ నశించుచున్నాడు.

---

చర్యలో నిర్వహిస్తున్న పనులూ, వాటికై వారు వ్యయించే శారీరక మానసిక శక్తులూ బహుశః సమకాలీన మానవ జాతిలోనే ఎవ్వరూ సాధించలేనివిగా వుంటాయి వారికి విశ్రాంతిలేదు ఎంతో స్వల్పమైన ఆహారం, (అదే మన విషయంలో అయితే నీరసించి పోతాం) విశ్రాంతి రాహిత్యం అనేవి భగవాన్ బాబావారి ఆహార విహారాలలో గల విశిష్టమైన లక్షణాలు.

" Keeping of equanimity - keeping our selves cool, is perhaps the most vital factor in sound mental health. This equanimity is possible only by mental relaxation. One has to learn to work in a relaxed way, do everything with a mental coolness and physical ease " అంటారు డా॥ M M. భంగారా, President of Health Sciences Trust (భవాన్స్ జర్నల్ 2-7-1978).

మానసికంగా మనం ఎప్పుడూ సమత్వస్థితిని కలిగి వుండటం, ఏ పని చేస్తున్నా కూడా మానసికమైన వొత్తిడి, ఆందోళన, అస్థిమితత్వం, అస్థిరత్వం లేకుండా పనిచేయగలగటం, ఎప్పుడూ మానసికంగా చల్లదనాన్నీ, శారీరకమైన తేలికతనాన్ని అనుభ

వించటం అనేవే మానసిక స్వస్థతలోగల విశిష్టమైన లక్షణాలు.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి ప్రభావంలోకి వచ్చాక 1974 నుంచీ 1994 వరకు చేస్తున్న మానసిక సాధన ఫలితంగా ఈ రచయిత కూడా పైన వివరించిన నిత్యానుభూతులను అనుభవిస్తూనే వున్నాడు. మనం అనుభవించే మంచినీ, చెడునూ కూడా యితరులపైకి మనం ప్రసరింపజేస్తూవుంటాం. తెలిసి కానీ, తెలియక కానీ. 'మీతో కాస్సేపు మాట్లాడితే చాలు మా మనస్సులు కూడా తేలికపడతాయి. టెంషన్‌లను పోగొట్టుకొని ప్రశాంతిని వరిస్తాయి' అనేవారు చాలామంది ఉన్నారు ఈ రచయితతో. మనం అనుభవించే ఈ మానసిక శాంతి, విశ్రాంతులు మన నిత్య జీవితంలో కూడా తోటి వారిని ప్రభావపరుస్తూ, వారికి శాంతి ఆనందాలను అందజేస్తాయి అని వివరించటానికే సవినయంగా స్వవిషయం ప్రస్తావించవలసి వచ్చింది.

వ్యక్తిగతస్థాయిలో యితరులలో గల మానసికమైన టెంషన్లు తొలగించి, వారిలో Awareness కలిగించటం, వారిలో ఆత్మవిశ్వాసం, ఆత్మతృప్తి, వంటి సుగుణ సంపదను వెలికి తీయటం, అంతవరకూ వారు భరించలేనంతగా అనుభవించిన మానసిక వొత్తిడులను, డిప్రెషన్లను పోగొట్టుకోవటంలో సలహాలు, సూచనలు, సాధనలూ వారికి అందించటం అనేవి ఈ రచయితకు గల వ్యక్తిగతమైన సేవాసాధన

ప్రతి మనిషి తన వ్యక్తిత్వాన్ని తనకు తానే నిర్మించుకోవాలి అందుకు మనస్సే ఒక ఆయుధం, పనిముట్టు పరిపూర్ణమైన మానవత్వంతో కూడిన వ్యక్తిత్వ నిర్మాణానికి అవాంతరాలే, అడ్డంకులే మన నిత్యజీవితంలో మనం అనుభవించే ఈ టెంషన్లు, ఈ ద్వేషాలు, ఈ జుగుప్సలు, ఈ అసహనాదులూ, ఈర్ష్యలూ, అనుచితమైన ఆలోచనలూ. శ్రీ విలియం జేమ్స్ అమెరికా జాతి గర్వించదగిన ప్రఖ్యాత తత్త్వవేత్త, మనస్తత్త్వవేత్త. వారి మాటలే యివి.

" The greatest discovery of my generation is that human beings can alter their lives by altering their attitudes of mind " అన్నారు వారు.

ఈ తరం మానవాళి సాధించిన గొప్ప పరిశోధన ఏమిటి ? అంటే మానవులు తమయొక్క మానసిక ప్రవృత్తులను, ఆలోచనా రీతులను సక్రమ విధానంలోకి మార్చుకోవటం ద్వారా, వారి జీవితాలు కూడా తదనుగుణంగా మారిపోతాయి, రూపాంతరం చెందుతాయి అనటమే అంటారు వారు.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఈ దృక్పథాన్ని లక్షలాది, కోట్లాది మానవులలో ప్రసరింపజేస్తూ, ఈనాడు మానవత్వపు పునర్నిర్మాణ మహోద్యమాన్ని చేపట్టిన అవతారమూర్తులు. 1976 వ సంవత్సరం దసరా పండుగల సందర్భంలో ప్రతి మనిషీ ముందుగా తన మనస్సు యొక్క తత్త్వాన్ని తాను తెలుసుకోవాలనీ, అదే ఆధ్యాత్మిక సాధనలో గల తొలిమెట్టు అని చెబుతూ 'మనస్సు - మర్మము' అనే ప్రసంగాలను అనుగ్రహించారు. 'నిజముగా మనము తెలుసుకోవలసింది దైవ సాక్షాత్కారమనుకొంటున్నాము పరమాత్మ యొక్క అనుగ్రహము అనుకుంటున్నాము. మోక్షప్రాప్తి అనుకొంటున్నాము అది కాదు మనము తెలుసుకోవలసింది మన మనస్సుయొక్క మర్మాన్ని. దానిని తెలుసుకుంటే మోక్షం తనంతట తానే మనకు లభిస్తుంది, సాక్షాత్కారమూ లభిస్తుంది' అంటారు. మనస్సు - మర్మము లో బాబా.

(యింకా వుంది)

[టెంషన్ - వర్రీ (Tension - worry) తో కూడినా మానసిక స్థితిని సరిచేయటంలో మనం చేయవలసిన సాధనను గూర్చిన వివరాలు వచ్చే వ్యాసంలో వుంటాయి.

- సంపాదకుడు]

# శ్రీ సత్యసాయిబాబావారితో నా అనుభవాలు

—డా॥ భాటియా

[జపాను దేశపు సత్యసాయి సంస్థలవారి " కాన్ సాయి లైటు Vol 32 మార్చి 1994 " సంచికలో ప్రచురింపబడిన వ్యాసమునకు అనువాదము- ఎన్. బి. ఎస్. రామారావు.]

"సూర్యోదయమగునపుడు సూర్యకిరణములను తొలుదొలుత భూమిపై ముద్దిడుకొనగల్గిన పవిత్రభూమి 'జపాను'కు నమస్సుమాంజలులు. అమెరికాలో జరిగిన రక్తనిధికి సంబంధించిన సమావేశములో హాజరై, నేనిపుడే అమెరికా నుండి జపాను చేరితిని. "వ్యాప్తి చెందుటయే" జీవితమని శ్రీ సత్యసాయిబాబా వారంటూంటారు సాయిప్రేమ ప్రపంచ వ్యాప్తి చెంది అతి దూర తీరములలో నివసించు సోదర సోదరీమణులు అటు అమెరికా- ఇటు జపాను- అందరూ ఇచట కలిసికొనుట సాయిప్రేమ వ్యాప్తికి ఇదే నిదర్శనము. నాగసాకి- హిరోషిమాలో మరణించిన వారికి నా సానుభూతి- అది చాలా హృదయవిదారక విషయము " అంటూ తమ ఉపన్యాసము కొనసాగించిరి

" God is already on earth! On your 30th birthday will be face to face with him " (ఇది నా అనుభవము)

నాకు 16 ఏండ్ల వయస్సున్నప్పుడు మా యింటికి ఒక సాధువు వచ్చెను. అతడు నన్ను, 'నీ భవిష్యత్తులో ఏమి చేయదలచుకొన్నావు?' అని ప్రశ్నించినాడు 'నేను డాక్టరు చదవాలనుకొంటున్నాను' అని సమాధానము చెప్పాను ఆయన వెంటనే నన్ను చూసి, 'నీవీ సంవత్సరము డాక్టరు కోర్సులో చేరలేవు రెండు సంవత్సరముల తరువాత మాత్రమే సాధ్యపడును ' అన్నాడు నేను వెంటనే ఆ సాధువుతో, 'భగవంతుడు భూమిపైకి దిగివచ్చినా, నన్నాపలేడు నేనీ సంవత్సరమే మెడికల్ కాలేజీలో చేరెదను' అన్నాను. ఆ సాధువు నన్ను చూసి నవ్వి! " కుమారుడా! భగవంతుడిప్పటికే భూమి పైకి వచ్చివున్నాడు. నీ ముప్పదవ జన్మదినమునాడు నీవాయనను ముఖాముఖి కలిసికొనగల్గెదవు " అన్నాడు.

నేను భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి గురించి తొలిసారిగ 1970 సం॥లో విన్నాను సెప్టెంబరు 26-1981 సం॥ తొలిసారిగా నేను ప్రశాంతినిలయం వెళ్ళి స్వామిని దర్శించాను. స్వామి, " రేపు నీ జన్మదినమా? " అన్నారు 'అవును స్వామీ' అన్నాను. స్వామి, " సరే! నమస్కారము తీసికొందుగాని " అన్నారు. ఆరోజు సాయంత్రం స్వామి నన్ను ఇంటర్వ్యూకి పిలిచి పాదనమస్కారం తీసికోమన్నారు. స్వామి నామోచ్చరణతో, 'సాయిరాం' అంటూ నా జన్మదిన తొలి ఘడియలు సాగేలా చెయ్యమని నేనా ఇంటర్వ్యూలో స్వామిని ప్రార్థించుకున్నాను. 26 సెప్టెంబరు 1981 అర్ధరాత్రి గం 11-45 ని॥ సమయం. నా గదిలో స్వామి ఫోటో ముందు దీపం వెలిగించాను. సరిగా 12 గం॥ అయ్యి తొలి సెకండు సమయానికి అంటే 27 సెప్టెంబరు 1981 అని గడియారం సూచించగనే (అర్ధరాత్రి- నా జన్మదినం ప్రారంభం కాగానే) నేను ఒక్కసారి ఉలిక్కిపడి 'స్వామీ' అన్నాను స్వామి (భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు) నాముందు భౌతికంగా నిలబడి ఉన్నారు. స్వామి నన్ను చూసి, 'ఈరోజు నీ జన్మదినమా? నాతో రా! " అనగానే నేను స్వామి ప్రశాంతి మందిరంలో ఇంటర్వ్యూ రూములో ఉన్నాను. స్వామి తమ సింహాసనంపై కూర్చోగానే- ప్రశాంతిమందిరం గాలిలో తేలిపోవడం

## విదురనీ

యథాశ చికీర్షన్తి
యథాశక్తి చ కుర్వతే
న కించదప మన్యన్తే
నరాః పండిత బుద్ధయః ”

వివేకవంతులైన మానవులు, తమ శక్తి ననుస రించియే పనులు చేయదలంతురు. తమ శక్తి ననుస రించియే పనులు చేయుదురు. ఏదియును నీచమైనదిగా తలంచరు.

---

మొదలెట్టింది. ఆ మందిరం పైకి లేవగానే, క్రింద బంగారం, వెండి, వజ్రములు, గోమేధకములు, పచ్చలు, మరకత మాణిక్యములు రాసులు పోసివున్నాయి. ప్రపంచంలో ఎక్కడాలేని సిరిసంపద స్వామి పాదార విందముల వద్ద నాకు సాక్షాత్కరించింది. స్వామి నన్ను చూసి, “అవి అన్నీ తీసికో! ఇవి నీకు జన్మదిన కానుకలు ” అన్నారు. నేను వెంటనే స్వామిని ప్రార్థించాను : “భగవాన్ ! నేనీ సిరిసంపదల కోసం భూమిపైకి రాలేదు. నాకు నీవే కావాలి నీవు తప్ప ఇతరమేమీ అక్కరలేదు” అన్నాను స్వామి నా తలను వారి ఒడిలోకి తీసికొని, నా భుజంపై జోలకొట్టారు. తెల్లవారుజాము గం॥ 4-30 ని॥ వరకూ స్వామి ఒడిలో నిద్రపోయాను తెల్లవారుజాము గం॥ 4-30 ని॥లకు స్వామి నన్ను తిరిగి నా గదికి పంపించివేసారు. నేను అక్కడ మాయమై నా గదిలో ఉన్నాను.

ఉదయమే దర్శనానికి వరుసలలో కూర్చున్నాను. సెప్టెంబరు 27, 1981. స్వామి వచ్చి “Birthday to day ?” ఈ రోజు జన్మదినమా ? అని అడిగారు. అపుడు నా ఒడిలో నా చిన్న కూతురు ఉన్నది. స్వామి మళ్ళీ ‘ నీ జన్మదినమా ? నీ కూతురు జన్మదినమా ? ’ అన్నారు స్వామీ ! నా జన్మదినమే ! అన్నాను. స్వామి, కాదు ! ‘నీ కూతురు జన్మదినం’ అన్నారు. నేనపుడు కాదు స్వామీ ! నా జన్మదినమే అన్నాను. అపుడు స్వామి, ‘ఏమి తండ్రివి నీవు ! నీ కూతురు నెలసరి జన్మదినం - నీకు సంవత్సరపు జన్మదినం’ అన్నారు. ఆ రోజుకి సరిగా నా కూతురికి 7 నెలలు నిండాయి. నాకు 30 వ జన్మదినం (30 సం॥) స్వామి నన్ను ఇంటర్వ్యూకి పిలిచారు. నా తోటి స్నేహితుడు దురదృష్టవంతుడగుటచే చక్రముల కుర్చీలో నాతోపాటే ఇంటర్వ్యూలోవున్నాడు. స్వామి, అతను నేనూ క్రిందటి జన్మలో సోదరులమని - ఈ జన్మలో కూడా సోదర ప్రేమతోనే మేము జీవించాలని చెప్పారు.

అపుడు స్వామి నన్ను మళ్ళీ అడిగారు. ‘ఈరోజు నీ జన్మదినమా ? డాక్టరుకి 30 వ జన్మదినం ... 30 వ జన్మదినం .... 30 వ జన్మదినం’ అన్నారు. వెంటనే నాకు 16 వ ఏట సాధువు చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి నేను నా 30 వ జన్మదినంనాడు భగవంతుడి ముందు ముఖాముఖీ ఉంటానని ఆనాడు సాధువు చెప్పిన మాట నిజమైంది నేను చిన్నప్పటినుంచీ కృష్ణుడంటే చాలా ఇష్టపడేవాడిని ఈ రోజుకీ కూడా నాకు సర్వం కృష్ణుడే. నన్ను చూసి స్వామి ‘డాక్టర్ ! నీవు అనేక సంవత్సరాలుగా గీత చదువుచున్నావుకదా! (భగవద్గీత) గీత అంటే ఏమిటి ?’ అన్నారు. నేను సమాధానం చెప్పబోతుండగా స్వామి, ‘When I was Krishna’ నేను శ్రీకృష్ణుడుగా ఉన్నపుడు .... ’ అని అంటూంటే స్వామి భౌతికకాయం శ్రీకృష్ణుని రూపంలోకి మారి పోయింది’

అలా నాకు నా 30 వ జన్మదినంనాడు భగవంతుడితో ముఖాముఖీ అనుభవం జరిగింది. అంటూ తమ ఉపన్యాసం కొనసాగించారు డా॥ భాటియా. ఇంకా ఇలా చెప్పారు.

‘నాకు అన్నవాహికలో పుండు (Peptic ulcer) హృదయ రోగము - రక్తపోటు వుండేవి. పుండు రాపిడిజరిగి వెంటనే ఆపరేషన్ చెయ్యాలన్నారు వైద్యులు.

నేను సత్యసాయిబాబావారి దర్శనం చేసికోవాలి. ఆయన చెప్పినట్లు చేస్తానన్నాను వారితో. స్వామిని దర్శించాను. స్వామి నన్ను ఇంటర్వ్యూకిపిలిచారు. ఆ ఇంటర్వ్యూలో 14 గురు భక్తులం ఉన్నాం. స్వామి నాకు తప్ప మిగతా అందరికీ విభూతి సృష్టించి ఇచ్చారు ఆఖరున స్వామి 'డాక్టర్ ! నీ ప్రసాదం ఉండిపోయింది ' అన్నారు. నేను చెయ్యి చాచాను. స్వామి 'నోరు పట్టు' అన్నారు. స్వామి నా నోటిలో విభూతిపోసారు. నా హృదయము, పొట్టపై వారి చేతితో నిమిరి, ఇక వెళ్ళు నీకు అన్ని రోగాలూ తగ్గిపోతాయి అన్నారు. నేనీనాడు మీ ముందర ఏ రోగము లేని ఆరోగ్యవంతుడిగా నిలబడిఉన్నాను'

**బంగారపు కలము Golden Pen**

ఒకసారి నాకు స్వప్నం వచ్చింది. నేను శ్రీ సత్య సాయిబాబావారితో కలిసి, వారి గదిలో కూర్చున్నాను. (ఆ కలలో) స్వామి బంగారపు పత్రంపై బంగారపు కలంతో వ్రాస్తున్నారు. ఓహో ! ఆ కలం ఎంత అదృష్టం చేసికొందో ! విశ్వ ప్రభువుచేత ఉపయోగింప బడుతోంది కదా ! అనుకొన్నాను అది స్వామి నాకిస్తే బావుండును అనుకొన్నాను. స్వామి నాకేసి చూసి, ' Greedy Fellow ' దురాశాపాతకుడా ! అన్నారు. అంతటితో కల ముగిసింది నాకు మెలకువ వచ్చే సరికి సమయం 2 గం॥-45 ని॥ అయ్యింది ఆ రోజు రాత్రి. నా తలగడపై ఆ బంగారపు కలం నిజంగా భౌతికంగానే వున్నది.

[డా॥ భాటియా ఎంతటి అదృష్టవంతుడో కదా ! మిగతా విశేషాలు వచ్చే సంచికలో ....అనువాదకులు]

## ప్రాణాలు తీసిన పాండిత్యం

—ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

విక్రమాదిత్యుని ఆస్థానములో నవరత్నములని పేరుపొందిన విద్వాంసులలో జ్యోతిషశాస్త్ర పండితుడు వరాహుడొకడు. ఈయన కుమారుడు మిహిరుడు.

జ్యోతిష్య విద్య తనతోబాటు అభ్యసించిన ఖనా అను ఆమెను మిహిరుడు వివాహము చేసుకున్నాడు. వీరిద్దరు కలసి ఖగోళశాస్త్ర పరిశోధనలు చేశారు అనేక జ్యోతిష్య విషయాలను కనుగొన్నారు. వీరిరువురిలోను ఖనా చాలా తెలివైనది

సభలో ఒకనాడు విక్రమాదిత్య మహారాజు 'ఆకాశ ములో మొత్తమెన్ని నక్షత్రములుంటాయి ?' అని ప్రశ్నించాడు ఎవ్వరూ సరియైన సమాధానము చెప్పలేక పోయారు.

వరాహమిహిరులు ఇంటివద్ద ఎంత ఆలోచించినా నక్షత్రాల సంఖ్య కనుగొనే మార్గము కానరాలేదు. తన వంటి జ్యోతిష పండితుడు జవాబు చెప్పలేకపోతే సభలో అవమానము అని వరాహుడు చింతిస్తున్నాడు

ఈ విషయము తెలుసుకున్న ఖనా సరియైన లెక్కలు వేసి నక్షత్రాల సంఖ్య తేల్చిచెప్పింది. రాజు విషయము తెలుసుకుని ఖనాకి తన ఆస్థానములో సముచిత స్థానము నవరత్నములతోపాటు కల్పిస్తానని చెప్పాడు.

మగవారున్న సభలో తన కోడలు వుండుట సహించలేక ఆమె నాలుక కోసివేస్తే మాటలాడలేదు కనుక సభకు రానవసరము వుండదని వరాహుడు భావించాడు. ఆ పనికి తన కుమారునే పురమాయించాడు కత్తితో నిర్దాక్షిణ్యముగా భర్త ఆమె నాలుక కోసివేశాడు. ఆ బాధకో విలవిలలాడి ఖనా చనిపోయింది.

పురుషాధిక్య సమాజంలో పరదాచాటున స్త్రీ బ్రతకా లన్న భావాలతో వున్న రాక్షసుల మధ్య ఆమె హత మార్చబడింది. బ్రతికివుంటే ఆ విదుషీమణి జ్యోతిష శాస్త్రంలో ఎన్నెన్ని పరిశోధనలు జరిపివుండేదో! పాపం ఆ రోజులలో ఆమె పాండిత్యం ఆమె ప్రాణాలు పోవ డానికి కారణమైంది. ○

# SRI SAI HARI REAL ESTATES

**PUTTAPARTHI** – 515 134

**ANANTHAPUR Dt. ANDHRA PRADESH**

పుట్టపర్తియందు ప్లాట్లు, ఇండ్లస్థలములు కావలసినవారు, అమ్మదలచినవారు ఈ క్రింది చిరునామావారిని సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ ఎదురుగా ప్లాట్లు
2. గోకులం పోస్టాఫీసు ఎదురుగా ప్లాట్లు
3. M. R. O. ఆఫీసు ఎదురుగా ప్లాట్లు
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డు వద్ద ప్లాట్లు
5. ప్రశాంతి నిలయం దగ్గరలో గల ప్లాట్లు
6. అపార్టుమెంట్స్ కావలసిన**వారు** కూడా సంప్రదించండి.

నెలకు రు 600/- ల స్కీములో చేరండి. (36 నెలలు) ప్రతి నెలా లాటరీ తీయబడును. బంపర్ డ్రా మారుతీ కారు. 2 సెంట్లు 20 × 40.

☞ గమనిక : భగవాన్ శ్రీ సత్యసాయిబాబా డెబ్బై (70) వ జన్మదిన శుభ సందర్భంగా 23-11-95 న శ్రీ సాయి భక్తులకు మా చిరుకానుకగా అపార్ట్‌మెంట్స్ కావలసిన వారికి డెబ్బై వేల (70 వేలు) రూపాయలకు రిజిస్ట్రేషన్‌తో సహా ఇవ్వగలము.

వివరములకు :

గ్రంధి యుగంధర్
బాబా చైతన్య సూపర్ బజార్
గుంటూరివారి తోట,
గాంధీబొమ్మ దగ్గర
గుంటూరు - 522 001
Phone : 21988

ఇట్లు
శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్
ప్రొ॥ **పి. సిద్ధయ్యశెట్టి**
ఆర్యవైశ్య సత్రం ఎదురుగా
పుట్టపర్తి - 515 134
Phone : 7413
S T D 08555

# సైబీరియాలో అణువిస్ఫోటనం

—————— భండారు పర్వతాలరావు

అది 1908 జూన్ 30, ఆ రోజు ఉదయం సరిగ్గా 7-17 కు సైబీరియాలోని తుంగుస్కా వద్ద ఆకాశంలో ఒక పెద్ద పేలుడు సంభవించింది. దాని వలన చుట్టుప్రక్కల 30 కి. మీ. పరిధిలోగల అడవులన్నీ నేల కూలాయి. అందులో వేలాది చెట్లు కాలిపోయాయి. ప్రత్యక్ష సాక్షులు చెప్పిన దానిని బట్టి ఒక పెద్ద అగ్నిగోళం ఆకాశంలో దూసుకొని వచ్చి అక్కడ పేలిపోయింది. అక్కడికి 400 కి. మీ. దూరంలోవున్న గ్రామాలవారు దూరంగా 'అగ్నిస్తంభం' కన్పించిందన్నారు. 600 కి. మీ. దూరంలో చావడులలో కట్టివేసివున్న వందలాది గుర్రాలు ఎవరో తోసినట్లు నేలపై పడిపోయాయి. అంతేకాదు, అక్కడ జనమంతా సెగ తగిలినట్లు బాధపడ్డారు.

అగ్ని ఆకాశంలోంచి భూమ్మీదకు దిగింది. అడవుల్ని, వాటిలోవున్న లేళ్ల, జంతువులతోసహా తినేసిపోయింది,' అని ఒక ఆటవికుడు చెప్పాడు ఆ అడవులలో తిరిగే దాదాపు 1500 లేళ్ల ఆనవాలు కన్పించకుండాపోయాయి.

ఇంతకూ ఆనాడు తుంగుస్కాలో ఏం జరిగింది? ఇంతవరకూ యితమిత్థంగా ఎవరూ తేల్చలేకపోయారు. కొంతమంది ఏదో తోకచుక్క వచ్చి భూమిని ఢీకొన్నదన్నారు. మరికొందరది పెద్ద ఉల్క అయివుండవచ్చని చెప్పారు. అయితే, ఆ ప్రాంతంలో తోకచుక్కకుగాని, ఉల్కకుగాని సంబంధించిన శకలాలుగాని, పదార్థాలుగాని లేవు.

మరికొందరు మేటర్‌కు విరుద్ధంగా వుండే యాంటీమేటర్ వచ్చి తగలటంవల్ల కలిగిన ప్రేలుడు అని భావించారు. కాని అలా జరిగివుంటే ఆ తరువాత కార్బన్-14 శాతం వృక్షాలలో పెరగాల్సి వుండె; కాని అలా జరగలేదు. అందువలన యాంటీమేటర్ ఆ ప్రేలుడుకు కారణం కాదని నోబెల్ బహుమానం పొందిన శాస్త్రజ్ఞుడు లిబ్బీ (Libby) తేల్చారు.

ఇంకా కొందరు అక్కడ బ్లాక్‌హోల్ (Black Hole) ఏర్పడటం అందుకు కారణం అని వాదించారు. విశ్వవీధులలో బ్లాక్‌హోల్స్ వుండవచ్చు. భూగోళం అటువంటి వానికి దగ్గరగా వచ్చినప్పుడు అవి భూగోళం నుండి దూసుకొనిపోగా అటువంటి ప్రేలుడు సంభవించేందుకు ఆస్కారముంది. కాని అప్పుడు ఆ బ్లాక్‌హోల్ సైబీరియావద్ద భూమిలోకి జొరబడితే ఆఫ్రికా నుండి బయటకు పోవాల్సి వుంటుంది. అలా జరగలేదు కనుక ఆ ప్రేలుడు బ్లాక్‌హోల్ వలన కలిగివుండదని శాస్త్రజ్ఞులు నిర్ధారించారు.

1976 లో జాన్ బాక్స్టర్, థామస్ అట్కిన్స్ అనే యిద్దరు జర్నలిస్టులు ఒక పుస్తకం ప్రచురించారు. అందులో సైబీరియా వద్ద జరిగిన ప్రేలుడు గ్రహాంతరవాసులు ప్రయాణిస్తున్న వ్యోమనౌక చెడిపోయి అక్కడ పేలిపోవటం వలన కలిగిందని సిద్ధాంతీకరించారు. ఆ వ్యోమనౌక అణుశక్తి ద్వారా నడిచేదనీ, అందువలన సైబీరియాలో కలిగినది అణువిస్ఫోటనమనీ వారు వాదించారు అందుకు ఒక ఋజువుగా వారు ఆ ప్రాంతంలో మట్టి వేడిమికి కరిగి గాజుగా మారటాన్ని వారు పేర్కొన్నారు. ప్రేలుడు వలన కలిగిన కాంతి మామూలు కాంతికన్నా ప్రకాశంగా, దట్టంగా వుండటం, పేలుడు సమయంలో భూమి చుట్టూవున్న అయస్కాంతక్షేత్రం చెదరిపోవటం, మట్టిగాజుగా మారినప్పుడు అందులో భూమిపై లభించని ఖనిజాల ఛాయ కలిసివుండటం తమ వాదాన్ని బలపరుస్తున్నాయని వారన్నారు.

ఒకవేళ వారి వాదం నిజమైతే, 'వచ్చిన' వారెవరు? ఏ గ్రహంనుండి వచ్చారు? వాళ్ళేమయినారో కనుగొనటానికి మళ్ళీ యింతవరకు ఎవరూ వెదకటానికి ఎందుకు రాలేదు? ఏ ప్రశ్నకూ జవాబులేదు.



# తమసోమా జ్యోతిర్గమయ

-ఆర్. యస్. కె. మూర్తి

పత్రికలలో ఒక వార్త వచ్చింది...

నూతనంగా ఏర్పడిన తెలుగుదేశంపార్టీ ప్రభుత్వం తరపున రాష్ట్ర మంత్రి ఒకరు భగవాన్ శ్రీ సత్యసాయి బాబాను దర్శించివెళ్ళారు. అనంతపురం జిల్లాలో చిన్నా పెద్ద ప్రాజెక్టులూ, గ్రామాలకు మంచినీటి సరఫరావంటి కొన్ని పథకాలకు ప్రభుత్వం బాబావారి ఆశీస్సులు కోరింది. బాబాగారట్టి ప్రజోపయోగ పథకాలకు 300 కోట్ల రూపాయలు ఆశీఃపూర్వకంగా అందించగలమన్నీ .... అయితే వచ్చే నవంబరు నాటికల్లా ధనమంతా సద్వినియోగమై, చేపట్టిన పథకాలు పూర్తి కావాలని ఆశ్వాసించారు.

ప్రభుత్వంవారిప్పుడు క్రిందామీదా అవుతున్నారని రాజధాని వర్గాలకథనం, పథకాలకని ఖర్చుపెట్టే ప్రతి పైసాసద్వినియోగంఅవ్వాలంటే-అది సాధ్యమవుతుందా? స్వర్గీయ రాజీవ్‌గాంధి లెక్కల ప్రకారమే ప్రభుత్వం చేతిలో ఖర్చయ్యే రూపాయిలో 15 పైసలు మాత్రమే గదా ప్రజలకు చేరేది? రెండవది - కాలపరిమితికి లోబడి పథకాలు పూర్తిచెయ్యటం మన ప్రభుత్వాలు ఎరుగని పని. మూడు దశాబ్దాలకు పూర్వమెప్పుడో మొదలుపెట్టిన నాగార్జునసాగర్ ప్రాజెక్టే నేటివరకు పూర్తిగా పూర్తికాలేదు. అప్పుడెప్పుడో పడిపోయిన బ్రిడ్జి స్థానంలోనే మరొకటి కట్టాలా ? వేరేచోట నిర్మించాలా - అన్నది నేటికి నిశ్చయంకాలేదు.

బాబాగారి అభీష్టాన్ని మన్నించి మనం నెగ్గుకు రాగలమా అని అధికార వర్గాలు అతలాకుతలం అయిపోతున్నవని పత్రికలవారి పరిశీలన.

కొన్ని పత్రికలవారైతే బాబాగారిలా ధనాన్ని ప్రభుత్వానికిచ్చి, వారిచేత పని చేయించటంకంటే.... తామే అట్టి ప్రజోపయోగ పథకాలను పూర్తిచేయించి ప్రజలకు అందించడం మంచిదని సూచిస్తున్నారు, అనుకున్న రోజుకి అనుకున్న విధంగా బాబాగారి ఆశీస్సులతో పూర్తిఅయి ఉపయోగంలోకి వచ్చిన సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటలును వారి సందర్భంగా ఉటంకిస్తున్నారు. బాబా ఆదేశిస్తే, వారి భక్తులే - యింజనీర్లు తదితరులు పథకాలనన్నింటినీ పూర్తిచేసి అప్పగిస్తారని ఒక పత్రికవారు మరీ ప్రత్యేకంగా వివరించారు.

## భక్తిశ్రద్ధలు :

ప్రభుత్వ వర్గాలు చేయలేని పనిని, బాబా భక్తులు చేయటం ఎట్లా జరుగుతోంది. అక్కడా యిక్కడా పని చేయవలసినది ఇంజనీర్లు తదితరులే గదా ! ఒకరిలో లోపించి మరొకరిలో ఉన్న దేమిటి ?

బాబాగారి భక్తులలో భక్తిశ్రద్ధలున్నాయి. భగవాన్ యందు భక్తి. వారు ఆదేశించిన కార్యం నందు శ్రద్ధ ప్రభుత్వ వర్గాలలో అవి లేవు. మంత్రులు మాన్యులయందు అధికారులకు చులకన భావం తాము చేయవలసిన పనియందు అలసత్వం ఇక అవినీతి సంగతి చెప్పనే అక్కరలేదు. ప్రభుత్వ యంత్రాంగంలో అది సర్వాంతర్యామి.

వాస్తవానికి ప్రభుత్వంవారిలోనే భక్తిశ్రద్ధలు అధికంగా ఉండాలి. దేశమునందు భక్తి, ప్రజాశ్రేయస్సునందు శ్రద్ధ వారిలో పుష్కలంగా ఉండాలి

నేటివారిలో అవి నిండుకున్నాయి సరే రేపటివారిలో నేటి యువతరంలోనైనా వీటిని పూరించటానికి ప్రభుత్వాధినేతలు దేశపు నాయకత్వం ఏమైనా ఆలోచనలు చేస్తున్నదా ?

## విశాల వ్యాప్తి

దురదృష్టమేమిటంటే .... నేడున్న దేశపు రాజకీయ నాయకత్వం తద్విరుద్ధమైన పనులను చేస్తున్నది. రేపటి తరాన్ని జులాయిలుగా .... నీతి నిజాయితీలులేని భ్రష్టులుగా రూపొందించటానికి ప్రభుత్వ స్థాయిలో జరుగని ప్రయత్నమేలేదు. విషాలను వ్యాపింపచేయటంలో ప్రభుత్వాలు అలసత్వం వహించటంలేదు.

ఉదాహరణకు_టి. వి. నే తీసుకోండి. 12 ఛానల్సులో 24 గంటలూ నేడు టి. వి. మ్రోగుతూనే ఉంది. ఏ పాయింట్ ఆఫ్ టైములోనైనా టి వి. ఆన్ చేసిచూడండి ఏం కనిపిస్తుంది ? ఉద్రేకాలను రెచ్చగొట్టే ఏదో ఒక కార్యక్రమం. మనిషికీ, దేవునికీ పనికొచ్చే ఒక్క కార్యక్రమం కన్పించదు _ ఈ 12 ఛానల్సులో వీటి గొంతులు నొక్కలేదా_ ప్రభుత్వం కావాలనుకొంటే?

పోనీ ప్రభుత్వమే నిర్వహించే డి. డి. సంగతే తీసుకుందాం. డి.డి. అంటే దురదృష్ట దర్శన్, కాదంటే దౌర్భాగ్య దర్శన్ అనేవారున్నారు. చెత్తనంతా ఏం చెయ్యాలో తెలియక, డి.డి. కార్యక్రమాలుగా రూపొందిస్తారన్న జోక్‌వుంది.

క్రికెటు సీజను వస్తే టి.వి వారికి పండుగే. అందాలరాణుల పోటీలొస్తే అమితోత్సాహమే. సినిమా _ యిలాంటి చెత్త అందితే చిదానందమే.

దేశంలో ఎన్నో ధార్మిక కార్యక్రమాలు జరుగుతుంటై. సద్గురువులు సద్బోధనలు చేస్తూనే ఉంటారు. సత్కార్యాలు జరిపిస్తూనే ఉంటారు. సంస్కారాలను పంచి పెడుతూనే ఉంటారు. ఇవేవీ ప్రత్యక్షప్రసారం కావు_మన దూరదర్శన్‌లో.

జపాన్ టి. వి. వారి విజ్ఞత గురించి 'శ్రీవాణి' లో చదువుకున్నాం గదా ! ప్రైమ్ టైంలో మూడు గంటల పాటు వారు భగవాన్ బోధనలను ప్రసారం చేయనున్నారుట.

భగవత్స్వరూపులు ఎందరు మనమధ్య మసలుతున్నారో ! మనకు మార్గదర్శకం చేయగోరుతున్నారో మన డి. డి. వారు రోజుకో మూడు గంటలపాటు వీరి సురుచిర కాంతులు జనావళిపై ఎందుకు ప్రసరింపజేయకూడదు ?

అట్టి మహనీయుల ప్రభావము ఏకొంచెము కూడ మన యువతపై పడకుండా మన ప్రభుత్వాలు, టి.వి.లు సినిమాలు, మట్కాలు, జూదాలు, ఆటలు, పోటీలు, మత్తులు, మాయాజాలాలలో .... ఎంతగా శ్రద్ధ తీసుకుంటయ్యో !

యువత ఈ కఠోర వాస్తవాన్ని గుర్తించాలి. జాతి శ్రేయోభిలాషులు జడత్వాన్ని విడనాడాలి. రాజకీయాలు వాటి తీరుతెన్నుల వికారపు ప్రభావాలకు దూరంగా నడవాలి, నడిపించాలి. సద్గురువుల సదాచార వ్యవస్థల నీడలలోకి రేపటితరమున్నా చేరుకోవాలి. విహితస్వార్థం నేటి యువత చుట్టూ నిర్మించుకొస్తున్న విషవలయాలను యువత గుర్తించాలి, ఛేదించుకొని బయటపడాలి. ఉత్తమ సంస్కారాలను అలవరచుకోవాలి. మహాత్ముల రావాలి. మంచితనపు వెలుగులోకి ముందుకి నడవాలి.

తమసోమా జ్యోతిర్గమయ !

---

గురువునందు అనన్యభక్తితో ఏ దాపరికము లేక శరణుజొచ్చిన, అతడు మనలను దుఃఖముల నుండి మోక్షమునకు గొనిపోవును. ఈశ్వరభక్తికి గురుభక్తి అవసరము ప్రజలకు గురుభక్తి లేమిచేతనే దైవభక్తి కుదురుటలేదు. గురువు త్రిమూర్తి స్వరూపము అతడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు. అందువలన గురువునే దైవముగా భావించి పూజింపవలెను. — శ్రీ కంచికామకోటిజగద్గురు

# క్షమ

సోమంచి రామం

క్షమయా ధరిత్రీ ' - అన్నది ఆర్యోక్తి! భూదేవిని మించిన ఓర్పుగలవారెవ్వరునూలేరు: దిన దినానికి, క్షణక్షణానికి పెరిగిపోయే జీవరాసులన్నింటిని భరించగలిగే భూమాత యొక్క సహనం అనంతము.

"క్షమ కవచము, క్రోధమిది శత్రువు" అన్నారు భర్తృహరి! మనిషికి క్షమయన్నది రక్షణ కవచము. క్షమ కల్గిన మనిషే మహానుభావుడు. క్షమ యన్నది మహర్షుల కాభరణము. ఎంతటి బలోపేతులకైనను క్షమయన్నది అవసరము. సమయం సందర్భం బట్టి, అవసరమైతే అణిగి మణిగి ఓర్పు కల్గియుండుట ఉత్తముల లక్షణము. ప్రచండ ఝంఝామారుత ప్రభావానికి మహోన్నతములైన వృక్షరాజములు కూకటి వేళ్ళతో కూలిపోతాయి. కాని పచ్చని గరిక మొక్క తలవంచి ప్రళయగర్జనానంతరము, శిరమెత్తి నిలుస్తుంది అందుకనే 'అనువుగానిచోట నధికులమనరాదు, గొంచమైన నదియు గొదువగాదు' అంటారు ప్రజాకవి వేమన.

'కార్యవాది తాబేటివలె ముడుచుకొని దెబ్బలకైనను ఓర్వవలెను' అన్నది చాణక్యనీతి. అంటే సహనంతోనే కార్యమును సాధించవలెను. అతి విలువగలిగిన పసిడి కూడ, అగ్నిలో కాల్చబడి, సమ్మెట దెబ్బలను ఓర్చుకొననిదే సువర్ణాభరణంగా మార్పు చెందదు. అలాగే మనిషి సకల దుఃఖములను సహనంతో భరించడం సాధన చేయాలి.

' క్షాంతి తుల్యం తపోనాస్తి ' అన్నారు పెద్దలు. ఓర్మిని మించిన తపస్సులేదు. ఓర్మిగల వానికి ఓటమి ఉండదు తాత్కాలికముగా తలవంచినను, అంతిమ విజయమాతనిదే.

''శక్తి, సహనాలు సమభాగస్వాములు'' అన్నది ఖలీల్‌జిబ్రాన్ సూక్తిభావం '' సహన క్షేత్రంలో నాటిన బాధ, సంతోష ఫలాలనిస్తుంది ' అంటారాయన.

క్షమ గల్గిన వ్యక్తి దైవస్వరూపుడు! మహాత్ముడు పూజ్య బాపూజీ సహనానికి ప్రతీక ఈ చెంప కొడ్తే, ఆ చెంప చూపాల'న్నది ఆయన సిద్ధాంతము అంతేకాని "కన్నుకు కన్ను, పన్నుకు పన్ను'' అన్న ప్రతీకార భావం ఆయనకు అంగీకారం కాదు.

క్రైస్తవుల ప్రభువు ఏసుక్రీస్తు క్షమకు ప్రత్యక్ష సాక్ష్యం. ద్రోహచింతతో, శిష్యులే ఏసుక్రీస్తుకు శిలువ వేయిస్తారు.

'' ప్రభూ! వీరంతా అమాయకులు! వీరేంచేస్తున్నారో వీరికి తెలియదు. వీరిని క్షమించు'' అంటూ దైవాన్ని ప్రార్థిస్తాడు ఏసుప్రభువు అంతటి క్షమాగుణ సంపన్నుడు కనుకనే ఆయన క్రైస్తవులకారాధ్యుడు.

సహనానికి ప్రతిరూపం గ్రీసుదేశపు తత్త్వశాస్త్రజ్ఞుడు సోక్రటీసు ఆయన భార్య పరమ గయ్యాళి. అనరాని మాటలతో, అనుక్షణం భర్తను దూషిస్తుంది, హింసిస్తుంది. అయినా ఆయన కన్నెత్తి చూడడు, కన్నెత్తి పలుకడు. దాంతో చిర్రెత్తుకొచ్చిన ఆ భార్యామణి భర్త శిరసున నీళ్ళకుండ కుమ్మరిస్తుంది.

'అంతటి గంభీరమైన ఉరుములకు, మెరుపులకు ఇంతటి స్వల్పవర్షధార లేనా? ' అంటాడు ప్రశాంతంగా ఆయన.

క్షమాగుణం కలవాడే క్షమించగలడు తప్పుచేసిన వాని దోషములను సహనముతో మన్నించి, శిక్షించకుండుటయే క్షమించడం.

'చంపదగినయట్టి శత్రువు తనచేత, జిక్కెనేని కీడు
సేయరాదు,
పొసగమేలుచేసి పొమ్మనుటే చాలు విశ్వదాభిరామ
వినురవేమ!'

అంటాడు వేమన. అది మహాపురుషుల ఉత్తమ సంస్కార లక్షణం

తనను పరాభవించిన అహంకారి ద్రుపదుని బందీగ చేసి, మంచి మనసుతో మన్నించి హితోపదేశంచేసి పంపిస్తాడు ద్రోణుడు.

అందుకే క్షమించడమన్నది దివ్యగుణం.

సహనమున్న మనిషి దైవసమానుడు. ○

( 3 వ పేజీ తరువాయి )

ప్రతిధ్వనించాయి. ఆనాటినుండి 'దక్కన్ సర్దార్' నామధేయంతో శ్రీ కేశవరావుగారిని ప్రజలు పిలుస్తుండే వారు.

'ఇకపై ఈ ప్రపంచం నాకు సరిపడదు. కలుషిత వాతావరణంలో నేను బంధింపబడియుండలేను' అన్నట్లుగా కేశవరావుగారి ప్రాణపంచకము అనంత వాయువుల్లో కలిసిపోయింది. అదే ఆరోజు 1953 సం॥ మార్చి 29 వ తేది. వీరి జన్మస్థలం ఖమ్మం జిల్లా ఎఱ్ఱుపాలెం. జననం 1908 సం॥ సెప్టెంబర్ 3 వ తేది. తండ్రి శ్రీ వెంకట్రామారావు, తల్లి వెంకటనర్సమ్మ భార్య అన్నపూర్ణమ్మ.

'స్వాతంత్ర్య దేవాలయ గోపురం
మా సర్దార్ జమలాపురం' – దాశరధి

)-○-(

## జై ప్రజోత్పత్తి! శరణు

జన మారణాయుధ సమరమ్ము నరికట్టె
భూప్రజాశ్రేయమ్ముఁ బూనుమమ్మ
భూమి బ్రద్దలగు బాంబుల ధాటి కడలేడి
గర్భస్థ శిశువులఁ గావుమమ్మ
చెవుల పగలఁగొట్టు క్షిపణి ఘోషల భీతి
కల్లాడు ప్రాణుల నరయుమమ్మ
జలవాయు కాలుష్యములు హెచ్చి బహువిధా
మయ భయోత్పాతమ్ము మాన్పుమమ్మ
ధరణినే ప్రజయైన సోదరులె సుమ్మ
వారిపై నీ ప్రభావమ్ము వరలనేని
పోరు నిలుప "నేత"కింత బుద్ధి గరపు
చాలు; తల్లీ ! ప్రజోత్పత్తి జననిః! శరణు!

– పృథివి సుబ్బనాగయ్య

## ఒక చిన్న కథ

– కె. సరోజినిదేవి

రేపు భీష్మాచార్యులవారి సారథ్యంలో యుద్ధము జరుగనున్నది. ఆ క్రిందటి రాత్రి నిదురిస్తున్న ద్రౌపదిని కృష్ణుడు లేపి, తనను వెంబడించమని చెప్పి కౌరవ సేన గుడారము వద్దకు తీసికొనివెళ్ళినాడుట. భీష్మాచార్యులవారు నిద్రపోతున్నారు. ద్రౌపదిని కాళ్ళకు దణ్ణం పెట్టుమని కృష్ణుడాదేశించాడు. స్త్రీ చేతుల స్పర్శ కాళ్ళకు తగలగానే 'దీర్ఘసుమంగళీభవ' అని దీవించారు. లేచి కూర్చుని కళ్లు తెరచి చూస్తే, ద్రౌపదీ దేవి కట్టెదుట నిలుచున్నది. తెల్లవారితే యుద్ధంలో ఆమె భర్తలను చంపవలె. మరి ఈ ఆశీర్వచనమో ? ! వెంటనే కృష్ణునికేసి చూచాడు– 'ఇది నీ పనే కదా' అన్నట్లు.

కృష్ణుని భుజముమీద ఒక మూట వ్రేలాడుతూ ఉంది. భీష్ములవారు అడిగారు 'కృష్ణా! అది ఏమి ?' సైనికులందరు నిద్రపోవుతున్నారు. పాదరక్షలతో నడిస్తే చప్పుడయి నిద్రాభంగమవునన్న భయముతో ద్రౌపది పాదరక్షలను మూటకట్టి మోయుచున్నాను' అన్నాడుట. అదీ సేవాధర్మము. ఒక స్త్రీ పాదరక్షలను మూటగట్టి భుజము నుండి వ్రేలాడదీసుకొని మోసినది ఎవరు ? గదాధరుడు. అది అతను మానవాళికి చూపిన సేవాధర్మము.

ఈ రోజుల్లో పాదరక్షలు తెచ్చి ఈయవలసివస్తే, కాళ్ళతో నెట్టూనో, కాళ్ళకు వేసుకునో తెచ్చిస్తారు. నేటి బాలబాలికలు – అంతేగాని, తమకంటె అన్నిట్లో పెద్ద వారు, వారి పాదరక్షలు చేత్తో తెచ్చి, ఈ పెద్దవారి కాళ్ళ ముందర పెత్తే ఎంత బాగుండును అని వారికి తోచదు. ఎన్ని కథలు చదివినా, విన్నా, బాలబాలికల మనస్తత్వం మారుతుందా ? తల్లులె ఆదినుండి బోధించి, నిర్బంధించి చేయిస్తె చేస్తారేమొ? ఈ తల్లులకే అసహ్యమైతే ? ఇక ఎవరిని గర్హించాలి ? ఏమని హర్షించాలి ! ○

# కౌమరగిరి కారాగారలేఖలు

( గత సంచిక తరువాయి )

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది 3-1-1977

ప్రియమైన జయ,

అంతకుపూర్వం వ్రాసిన లేఖలలో 'ఆత్మజ్ఞానము' ను గురించి కొంత వివరించాను, మిగతా విషయములు ఈ లేఖలో వ్రాస్తున్నాను.

ఒక పర్యాయం ఏసుక్రీస్తు వద్దకు ఒక భక్తుడు వచ్చి "అయ్యా నాకు మోక్షము ఎప్పుడు లభించును?" అని ప్రశ్నించెను. అంతట ఏసుప్రభు తన సమీపమున నున్న ఒక పసిబాలుని చూపించి "నీ చిత్తము ఎప్పుడు ఈ బాలుని చిత్తమువలె తయారగునో, అప్పుడే నీకు మోక్షము లభిస్తుంది" అని చెప్పెను. ఎందువలన ? పసిబాలునియందు ఈర్ష్యాద్వేషాలు గాని, కామక్రోధాలు గాని ఉండవు. అతని మనస్సు అతి నిర్మలంగా ఉంటుంది. నిర్మలమైన, శుద్ధమైన చిత్తమును ఎవరు కలిగివుందురో, అట్టివారు మాత్రమే మోక్షమునకు అర్హులవుతారు. కనుక ప్రతి ఒక్కరూ సాధన ద్వారా అట్టి స్థితిని సంపాదించి తరించవలెను.

ఆత్మజ్ఞానము కొరకు ఎవరైనను ప్రయత్నించి సాధించవచ్చును యోగ్యతనుబట్టి సఫలతను బడయవచ్చును. స్త్రీలుగాని, పురుషులుగాని, బీదవారుగాని, ధనవంతులుగాని, ఏ కులమువారైనా మరెవరైననూగాని ఈ జ్ఞానజ్యోతిని వెలిగించుకొనవచ్చును జాతి, మత, కుల, వర్ణ, వర్గ లింగభేదములతో దీనికి ఎలాంటి సంబంధమూలేదు.. భౌతికశాస్త్ర పరిజ్ఞానము లేకపోయినప్పటికినీ, లౌకికవిద్యల నభ్యసించకపోయినప్పటికినీ ఫరవాలేదు ప్రాపంచిక చదువు సంధ్యలు లేవని విచారపడి, దిగులుపడి కూర్చోనవసరంలేదు. కావల్సింది నిశ్చలమైన నిర్మలమైన, చిత్తము అనన్యమైన భక్తి.

"యోమద్భక్తః సమే ప్రియః" 'ఎవడు నా యెడల భక్తి కలిగియుండునో, వాడు నాకు ప్రియుడు' అని భగవానుడు గీతలో చెప్పాడు. కనుక దిగులుపడనవసరంలేదు. చింతించనవసరంలేదు మహనీయుల ఆధ్యాత్మిక బోధనల వలన పరమార్థతత్త్వములను తెలుసుకొని, లేక విని, సతతమూ, శ్రద్ధతోచక్కగా శ్రవణం చేయడం, ఏకాగ్ర నిష్ఠతో, భక్తిప్రపత్తులతో వాటిని ఆచరించడంవలన తరించవచ్చును. పరమాత్మను సాక్షాత్కరించుకొనవచ్చును మోక్షమునుబడయవచ్చును. అట్టి ఆత్మజ్ఞానము ఎదుట ఈ సామాన్యమైన భౌతిక శాస్త్ర జ్ఞానాదులు ఎందుకూ పనికిరావు. ఇట్టి ఆత్మజ్ఞానం కొందరికి పూర్వజన్మసంస్కారంవల్ల ఇట్లేఅబ్బుతుంది. మరికొందరికి నిరంతర చింతన ద్వారా, అనన్య భక్తి ద్వారా నిదానంగా అబ్బుతుంది రామకృష్ణ పరమహంస ఇటువంటివారిలో అగ్రగణ్యులు. ఆయన ఎక్కువగా లౌకిక విద్యలనభ్యసించలేదు. ప్రాథమిక విద్య కూడా పూర్తిచేసినట్లు కనిపించదు అయినప్పటికినీ, నిరంతర నిష్ఠానుష్ఠానములతో, అచంచల భక్తితో, ఆ పరమాత్మను, ఆ కాళీమాతను సాక్షాత్కరింపచేసుకో గలిగినారు జ్ఞాననేత్రం తెరువబడింది, సకల శాస్త్రములు కరతలామలకములైనాయి. విశేష జ్ఞానమును సముపార్జించారు. ప్రపంచానికి జ్ఞానభిక్షను ప్రసాదించారు దారి దోపిడీగాడైన రత్నాకరుడు సాధన వలన వాల్మీకి మహర్షిగా మారిపోయి, అత్యున్నతమైన, ఆదర్శవంతమైన రామాయణ మహాకావ్యాన్ని ప్రపంచానికి అందించ గలిగాడు. కటిక కసాయివాడైన ధర్మవ్యాధుడు నిష్కామ

కర్మాచరణ ద్వారా మోక్షాన్ని పొందాడు. దానవుడైన ప్రహ్లాదుడు భక్తాగ్రేసరుడుగా పేరుగాంచాడు. వానరుడైన హనుమంతుడు సేవ చేసి శ్రీరామభక్తుడై తరించాడు 'జటాయువు' పక్షియైనను, భక్తుడై మోక్షమును సంపాదించాడు. దీనివలన గ్రహించవలసినది ఒకటి ఉన్నది. భగవంతుని దృష్టిలో మానవులైనా, దానవులైనా, జంతువులైనా, పక్షులైనా అంతా సమానమే. భగవంతునికి కావల్సింది అచంచలమైన భక్తి, హృదయ పవిత్రత, చిత్తనైర్మల్యము. శ్రద్ధాభక్తులు గల సాధకుడు మాత్రమే వీటిని సాధించి ఆత్మజ్ఞానమును పొందగలుగుతాడు కావున శాస్త్రములయందు, గురువునందు, దైవమునందు పరిపూర్ణ విశ్వాసం, నమ్మకం, అకుంఠిత శ్రద్ధాభక్తులు కలిగివుండవలెను. ముఖ్యంగా ఆత్మవిశ్వాసం కలిగి ఉండవలెను

ఒక పర్యాయం వివేకానందుడు " Faith, Faith, Faith in ourselves; Faith, Faith in God - that is the secret of Greatness " 'నమ్మకము! నమ్మకము! తనయందు నమ్మకము, దేవునియందు నమ్మకము-ఇదియే ఔన్నత్యమునకు, విజయమునకు కీలకము' అని ఎలుగెత్తి చాటాడు. ప్రపంచంలో ఈనాడు చాలామందిలో ఈ శ్రద్ధ, నమ్మకం, విశ్వాసములు లోపించినందువలననే లక్ష్యమును చేరుకోలేకపోతున్నారు. కనుక ఈ మూడింటిని అలవరచుకొని జీవితాన్ని సార్థకం చేసుకోవాలి. అత్యున్నతమైన ఆత్మజ్ఞానమును సంపాధించి మోక్షమును బడయవలెను. ప్రతిఒక్కరూ భౌతిక శక్తితోపాటు ఆత్మశక్తిని కూడా పెంపొందించుకొనవలెను. ఒక్క భౌతికశక్తి మాత్రమే మానసికవ్యధను పోగొట్టజాలదు, పరమశాంతిని కలుగజేయదు. ప్రతి ఒక్కరూ పరమాత్మ తత్త్వమునుకూడా బాగుగా తెలుసుకొనవలెను. తత్త్వజ్ఞానమనగా సత్యాన్వేషణ. సత్యాన్వేషణ విద్యార్జన చేయువారి ప్రథమ కర్తవ్యము.

మిగతా విషయములు తరువాత లేఖలో వివరిస్తాను. చిరంజీవులకు నా ఆశీస్సులు

ఇట్లు
నీ ...

## శ్రీవాణి సాంస్కృతిక మాస పత్రిక

### Form IV (See Rule-8)

| | | |
|---|---|---|
| 1. | ప్రచురణ స్థలము | మచిలీపట్నం |
| 2. | ప్రచురణ ఎన్నాళ్ళకు | మాసమునకు |
| 3. | ముద్రాపకుని పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 4. | ప్రచురణకర్త పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 5. | సంపాదకుని పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 6. | చిరునామా | 24-52, రామానాయుడుపేట, మచిలీపట్నం |
| 7. | ముద్రణాలయము | శ్రీవాణి ప్రింటర్స్ |
| 8. | భాగస్తులు | ఎవరూ లేరు |

కొమరగిరి కృష్ణమోహనరావు అనే నేను పై విషయములన్నియు యదార్థమని తెలుపుచున్నాను.

మచిలీపట్నం
ది. 28-2-95

కొమరగిరి కృష్ణమోహనరావు
ప్రచురణకర్త సంతకం

# పురందరదాసు

—కవుల ఆంజనేయశర్మ

ఆనాడు పర్వదినము. ప్రతివారు కొద్దో గొప్పో శక్తికొలది దానం చేసేరోజు. ఆచార ప్రకారం దగ్గర ఉన్న భీమా నదిలో ఉదయాన్నే స్నానంచేసి, బ్రాహ్మణులకు దానాలు చేస్తున్నారు చాలామంది. కృష్ణప్ప మాత్రం డబ్బు ఖర్చు అవుతుందనే భయంతో మసక చీకటి ఉండగానే ఎవరూ లేకుండా చూసి, స్నానంచేసి, ఇల్లు చేరుకొన్నాడు.

ఒక నిరుపేద తన కుమారునికి ఉపనయనం చేయాలంటూ, ఆ రోజే లక్ష్మీపుత్రుడైన కృష్ణప్పను దర్శించాడు. నాలుగుసార్లు ఇంటిచుట్టూ తిప్పించుకొని, చివరకు ఒక రాగి కాని యిచ్చి పొమ్మన్నాడు కృష్ణప్ప.

కృష్ణప్ప భార్య దయకలదని తన భార్య ద్వారా తెలుసుకొన్నాడు నిరుపేద. కాళ్ళీడ్చుకుంటూ మళ్ళీ బయలుదేరాడు కృష్ణప్ప ఇంటిదగ్గర లేని సమయం చూసి, అతని ఇంటికి వెళ్ళి అతని భార్యతో తన దుస్థితి చెప్పుకొన్నాడు.

వెంటనే కృష్ణప్ప భార్య తన ముక్కున ఉన్న బంగారు ముక్కుపుడక తీసి 'నేను ఇంతకంటే ఎక్కువగా యివ్వలేకపోతున్నాను' అని బాధ పడుతూ, దానిని అతనికిచ్చింది. ఆనందంతో తన ఇంటికి వెళ్ళిపోయాడు నిరుపేద

శుభకార్యమునకు కావలసిన సామానులు కొనుటకై అంగడికి వెళ్ళి ఆ వస్తువును అమ్మజూపాడు నిరుపేద. తిరిగి తిరిగి కృష్ణప్ప దుకాణానికే అతడు రావడం జరిగింది. కృష్ణప్ప ఆ వస్తువును చూసి, అది తన భార్యదే అని గుర్తుపట్టాడు 'ప్రస్తుతం నా దగ్గర సరిపోయినంత డబ్బులేదు, కొన్ని గంటలు పోయాక ఇస్తాను' అని చెప్పి పంపించివేశాడు నిరుపేదను.

కృష్ణప్ప కంగారుగా ఇంటికి వెళ్ళాడు. భార్యతో 'నీ ముక్కున ఉన్న ముక్కుపుడకవంటిదే చేయించుకోవాలని, కొంతమంది మన కొట్టునకు వచ్చారు. వారు దాన్ని చూస్తారుట తెచ్చియియ్యి.' అని అడిగాడు.

ఆమె భర్త ముఖంలోని కోపాన్ని కనిపెట్టింది. ఈ రోజుతో తన ఋణము తీరిపోయిందని అనుకొంది. భర్తతో 'మీరిక్కడే ఉండండి తీసుకువస్తాను' అని చెప్పి పూజా మందిరంలోకి వెళ్ళిపోయింది.

ఒక గిన్నెలో విషం పోసుకొని మురళీకృష్ణుని విగ్రహం ముందు కూర్చొని, కళ్ళుమూసుకొని, 'భక్తరక్షకా! దీనబాంధవా! నేను చేసిన తప్పు ఏమిలేదు. ఒక నిరుపేదకు సహాయం చేశాను, నన్నిప్పుడు రక్షించనిచో ఈ విషము తాగి నీ దగ్గరకు చేరుతాను' అని తాగడానికి గిన్నె పైకి ఎత్తబోయింది.. ఇంతలో పైనుండి గిన్నెలో ఏదో పడినట్లయింది.

కళ్ళు తెరచి చూసేసరికి అది తాను దానము చేసిన ముక్కుపుడక. ఆమె సంతోషంతో భర్తదగ్గరకెళ్ళి దానిని చూపించింది. కృష్ణప్ప ఆశ్చర్యపోయాడు. అతనికి ధన వ్యామోహం నశించింది, మనస్సునందు భక్తిభావం కుదిరింది. తన యావదాస్తిని బీదలకు అర్పించాడు. తులసీ మాలలు ధరించి, భక్తిపారవశ్యములో మునిగిపోయాడు. అతడే పేరు పొందిన పురందరదాసు.

)-O-(

( 8 వ పేజీ తరువాయి )

గాలి ఎందుకోసం నీవీ జగతులోకి వచ్చావు ? ఎందుకు నీవు చింతిస్తున్నావు ? పుట్టినప్పుడు ఏడ్చినావు, చచ్చినపుడు ఏడ్చినావు మధ్యమధ్య ఎన్నెన్నో కారణాలకు ఏడ్చినావు ధర్మజ్ఞాని కలుగుచుండ ఉద్ధరింప ఏడ్చినావా ? దేనికోసం ఏడ్చినావు ? ఏడ్పుకోసం ఏడ్చినావా ? కాదు.... మనము ఏడ్వవలసినది ఒక్క దైవం కోసమే. అదే రామకృష్ణుడు కూడనూ చెప్పాడు. ఎవరో బ్రహ్మసమాజం వారు వచ్చి ప్రశ్నించారు రామకృష్ణుణ్ణి 'రామకృష్ణా! నీవు దైవాన్ని చూచావా?' 'ఆ చూచాను, చూస్తున్నాను, మాట్లాడుతున్నాను అతనితోనే జీవిస్తున్నాను ? అతనితోనే తిరుగుతున్నాను అతనియందే ఉంటున్నాను' అన్నాడు రామకృష్ణుడు. 'ఏ విధంగా అతనితో తిరుగుతున్నావు? అతను ఎక్కడ ఉన్నాడు ? మాకు కనిపించటం లేదే' ? అన్నారు ఓ పిచ్చివాడా ! నీవు ధనముకోసం ఏడుస్తున్నావు, కీర్తి కోసం ఏడుస్తున్నావు, పదవికోసం ఏడుస్తున్నావు, చదువు కోసం ఏడుస్తున్నావు, సంసారంకోసం ఏడుస్తున్నావు, ఇతరులకోసం ఏడుస్తున్నావు, దైవంకోసం ఏడుస్తున్నావా ? దానికోసం ఏడ్వు నీకు తప్పక కనిపిస్తాడు' అన్నాడు రామకృష్ణుడు. ఈనాటి మానవుడు చిల్లర చిల్లర విషయాలకోసం ఏడుస్తున్నాడు జీవితానికి ప్రాణసమానమైనటువంటి యొక్క దైవత్వం కోసము ఏమాత్రం ఏడ్వటం లేదు దైవనిమిత్తమై ఏమాత్రము ఏనాడూ విచారించటములేదు అది లేనప్పుడు ఎన్ని ఏడ్చి ఏమి ప్రయోజనం ? ఇది ఏడ్పు కోసం ఏడ్చినట్టే. కనుక, మనం దైవకృపకు, ధర్మ కృపకు మనం దాసులం కావాలి ధర్మాన్ని మనం సాధించాలి సత్యాన్ని మనం పలకాలి. దేశరక్షణ కాదు మనకు ముఖ్యము. సత్య ధర్మాన్ని మనము రక్షించినపుడు ఆ సత్య ధర్మాలే దేశాన్ని రక్షిస్తాయి. కనుక, మనము విద్య నేర్చినటువంటిదంతా సత్య ధర్మ మార్గములోనే దీనిని ప్రవేశ పెట్టాలి.

విద్యార్థి విద్యార్థినులారా !

ఈనాడు మీరు బహుమతులను పొందారు. ఏమిటి ఈ బహుమతంటే అర్థము? 'బహు మతి' అనగా ఎన్నో మతులు అని అర్థము. ఒక మతి ఉంటేనే మనము ఇన్ని విధాలైన చింతలకు గురి అవుతున్నాము. బహు ...మతులు ఉంటుంటే నీ గతి ఏమైపోతుంది ? కనుక, నీవు బహు....మతులు నుంచి నీవు ఏక....మతివి కావాలి ఆ ఏక....మతి అయినపుడే దైవముయొక్క అను గహమనేటటువంటి బహుమతిని నీవు అందుకొంటావు అట్టి ఏక మతిని నీవు సాధించటానికి ప్రయత్నించాలి. ఆ ఏకమతి ఒక్క ప్రేమ ద్వారానే లభ్యమవుతుంది. నాయందున్న ప్రేమనే వారి యందు, వారి యందున్న ప్రేమనే వీరి యందు, అందరియందు ప్రేమ ఒక్కటే అనేటటువంటి ఏకాత్మ భావాన్ని మనం గుర్తించాలి కనుక, ఇట్టి ప్రేమతత్త్వాన్ని ప్రతి వ్యక్తి కూడనూ చక్కగా గుర్తించి అర్థం చేసుకోవాలి. ఈ ప్రేమతత్త్వము ఒక్క దైవ ప్రార్థన చేతనే మనకు లభ్యమవుతుంది ఈ ప్రార్థన కేవలము ఆడంబరముగా, అహంకారముగా చేస్తే కాదు హృదయపూర్వకముగా, అంతరాత్మలో పొంగి రావాలి కాని, అట్టి ధర్మ తత్త్వాన్ని మనం ఎప్పుడు పొందుతాము ? మనము హృదయము పరిశుద్ధం గావించుకోవాలి ' దుర్బుద్ధుల తలలున్న, మూరులు విను చెవులున్న, పొంచిచూచు కనులున్న పంచల విను మనసున్న, వంచితగుణ చిత్తమున్న, వంచించే మనసున్న, ఈ వికృతులు చూడగానే న్యాయము ఇక బ్రతకదన్నా ' అయితే ఈనాడు ఈ విధంగా అన్ని దుర్బుద్ధులు, దురాలోచనలు, దుర్గుణములే ఉంటున్నాయి ఈ అన్నిటికినీ మూల కారణము అహంకారమే అహంకారమనేటటువంటి రాక్షసుని మనలో ప్రవేశించకుండా చూసుకోవాలి ఏమిటి నీకు అహంకారము ? దేనిని చూచి నీకు అహంకారము? ఇంత పెద్ద విశ్వములోపల నీవెంతమాత్రము వాడవు? చూడండి ! ప్రపంచముయొక్క Map ని మీరు చూచి

నప్పుడు ఎంత విశాలముగా ఉంటుంది. ఇంత పెద్ద విశాలమైనటువంటి ఈ ప్రపంచ Map లో నీ India ఎంత ? ఈ India లోపల నీ Ananthapuram జిల్లా ఎంత ? ఈ అనంతపురం జిల్లా లోపల ఈ పుట్టపర్తి గ్రామం ఎంత చిన్నదిగా ఉన్నది. ఈ పుట్టపర్తి గ్రామంలో నీవెంత చిన్నవాడవు ఇంత అణుమాత్రమైనటువంటి నీవు ఇంత విశ్వాన్ని చూచి గర్వించటము ఎంత సిగ్గుచేటు ? నీకు అహంకారానికి ఎక్కడ కారణము ఉంటుండాది ? పోనీ అంతా నీవే అనే ఏకాత్మ భావము వచ్చినపుడు ఎవరిని చూచి నీవు అహంకార పడుతున్నావు ? రెండవ వస్తువే లేదు. కనుక, అప్పుడు కూడనూ అహంకారానికి అవకాశములేదు ఈ అహంకారమనేటటువంటిది కేవలము రాక్షసగుణము. కొంతమంది ఈ పదవుల యందు, కొన్నిరకములైనటువంటి ధనముల యందు విర్రవీగి అహంకారముతో అర్రులు చాస్తుంటారు. ఈ అహంకారము వానిని పతనం చేయటానికి పుట్టే మహా రోగము ఇతరులను మనము గౌరవించాలి. ఇతరుల నుండి మనము గౌరవాన్ని అందుకోవాలి. నీవు ఇతరులను గౌరవించక, ఇతరులు మాత్రము నిన్ను గౌరవించాలంటే ఎట్లా గౌరవిస్తారు ? విద్యార్థులు మొట్టమొదట నేర్చుకోవలసింది ఇదే. నీవు గౌరవాన్ని ఇతరులకు అందించు, ఇతరుల యొక్క గౌరవాన్ని నీవు అందుకో ఇతరులకు నీవు ప్రేమతో నమస్కారాన్ని అందించు, అప్పుడు ఇతరులు కూడనూ నీకు నమస్కారం అందిస్తారు Love is not one way Traffic. Give and take కనుక నీవు మొట్టమొదట ఇతరులను నీవు గౌరవించకుండా అందరూ నిన్ను గౌరవించాలంటే ఎందుకు గౌరవిస్తారు ? మొట్టమొదట నీవు వినయ విధేయతుడవుకావాలి "విద్యా వినయ సంపన్నః" వినయమున్నటువంటి వాడికే విద్య లభ్యమవుతుంది వినయ విధేయతలు లేనటువంటివాడు కేవలము ఒక రాక్షసుడితో సమానము. అలాంటి వాడు ఎన్ని చదువులు చదివి ఏమి ఫలము ?

ప్రపంచములో ఎన్నియో Universities ఉన్నాయి. ఎన్నో విద్యా సంస్థలు ఉంటున్నాయి కాని మన విద్యా సంస్థకు బయట ఉన్న విద్యాసంస్థలకు వ్యత్యాసాన్ని మన ప్రవర్తనలో నిరూపించాలి. అధికారులు కాని, గురువులు కాని ఆదర్శవంతులుగా నిరూపించాలి అధికారులు, అధ్యాపకులే పెడమార్గం పడుతుంటే పిల్లలు ఏ రీతిగా సరియైనమార్గంలో ప్రవేశిస్తారు ? కనుక, మొట్టమొదట 'అణుకువ' అనేటటువంటి దానిని సంపాదించాలి ఈ అణుకువ లేకపోయిన మనము చాలా మితిమీరి పోయినటువంటి రాక్షసులమైపోతాము.

కనుక మొట్టమొదట మీరు సాధించవలసినటువంటిది అణుకువ. ఈ విద్య యొక్క సారమంతా అదే. అప్పుడే మనము విద్యావంతులమనిపించుకుంటాము. లేకపోతే విషయవంతుడవవుతావు నీవు. కనుక మనము ప్రతి విషయమునందు కూడనూ అణుకువను సంపాదించుకోవాలి. నిరహంకారాన్ని మనం పోషించుకోవాలి నిరాడంబరముగా తిరగాలి. అసూయ మనలో మాత్రము ప్రవేశించకుండా చూచుకోవాలి. ఎవడో బాగుపడుతున్నాడని మనము అసూయ పడకూడదు ఎవడికో దండిగా Marks వచ్చాయని మనము అసూయ పడకూడదు ఈ అసూయకు, అహంకారానికి మూలకారణము స్వార్థమే. ఈ స్వార్థానికి చోటిచ్చినపుడు అనేకరకములైన దుర్గుణాలు మనలో ప్రవేశిస్తుంటాయి.

ఈనాడు మహా పవిత్రమైనటువంటి మహాపర్వదినం. ఇది అనేకరకములైనటువంటి ప్రాకృతములైనటువంటియొక్క భోగభాగ్యములను అందించే దినమది ఈ సంక్రమణ ధన కనక వస్తు వాహనాదులతో కూడి వస్తున్నది. ఇదిపుష్యమాసం ప్రకృతిని అందంగా చేసేటటువంటి పుష్యమాసము ఇది ప్రకృతి అందాన్ని చూస్తున్నామే కాని హృదయ అందాన్ని మనము ఏమాత్రము తగినట్లుగా మార్చుకోవటంలేదు. హృదయం అందము కావాలి ఆ హృదయం అందము కావాలంటే దానిలో

(తరువాయి 40 వ పేజీ లో)

# విజ్ఞాన రథసారథులు డా॥ యల్లాప్రగడ సుబ్బారావు

—సాయిప్రియ

కాలం చాలా విలువైనది. మనకు కావలసినంత సమయం మనకు దొరకదు. చాలామంది అనేక జబ్బులతో బాధపడుతున్నారు. వాళ్ళను రోగాలనుండి విముక్తి కల్గించడమే మన ప్రధాన కర్తవ్యం. ఇది యల్లాప్రగడ సుబ్బారావుగారి జీవిత లక్ష్యం. ఆ లక్ష్యసిద్ధికోసం ఆయన జీవితాంతం శ్రమించారు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన వ్యక్తి సుబ్బారావుగారు ఆధునిక వైద్య పరిశోధనా రంగంలో విశిష్టస్థానం సంపాదించిన వ్యక్తి ఆయన.

1895 సం॥ జనవరి 12 వ తేదీ పశ్చిమ గోదావరి జిల్లాలోని భీమవరంలో ఒక నిరుపేద కుటుంబంలో సుబ్బారావుగారు జన్మించారు. ఈయన తండ్రి భీమవరం తాలూకా ఆఫీసులో చిన్న ఉద్యోగి తండ్రి అనారోగ్యం కారణంగా, వారి కుటుంబం అనేక కష్టాలను ఎదుర్కోవలసివచ్చింది.

డా॥ సుబ్బారావుగారు బాల్యంలో ఎన్నో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొన్నారు. తల్లి కష్టపడి వీరిని చదివించింది. కాని సుబ్బారావుగార్కి జీవితం మీద ఆశ రోజు రోజుకు సన్నగిల్లుతుండేది. బ్రతికి ఏమి సాధించాలి అంటూ వేదాంత ధోరణిలో మాట్లాడేవారు. పాఠశాలకు కూడా సరిగ్గా వెళ్తుండేవారు కాదు. దీని కారణంగా మెట్రిక్ పరీక్ష రెండుసార్లు తప్పారు. ఆ సమయంలో ఆత్మహత్య కూడా చేసుకోవాలనుకున్నాడట ! అటువంటి తరుణంలో తల్లి కొడుకుకి అద్భుతమైన బోధ చేసింది. అది అర్జునుడికి, శ్రీకృష్ణుడు గీతలో చేసిన బోధకన్నా గొప్పది అనేవారు సుబ్బారావు గారు. తల్లి ఆయనతో ఇలా అందిట. 'చూడు నాయనా! మీ తండ్రి మరణించాక ఎంత కృంగిపోయానో నీకు తెలుసు ఆ తరువాత మీ అన్నయ్య అకాల మరణం చెందాడు. అది నాకు ఎంత బాధ కల్గించిందో నేను వర్ణించలేను ఇక మిగిలిన వారిలో నువ్వు చదువు మానేసి రోడ్లమీద తిరిగితే సమాజం నాకు ఎటువంటి గౌరవం ఇస్తుందో నీకు తెలీదా! నువ్వు బాగా చదువుకుని ప్రయోజకుడివి అయితే నేను తలఎత్తుకు తిరుగగలను'.

జీవితంలో ఎదురయ్యే చేదు సంఘటనలను ఎలా ఎదుర్కోవాలో ఆమె చెప్తుంటే ఆ సమయంలో సుబ్బారావు గారికి తల్లి శ్రీకృష్ణభగవానుడిలాగా కనిపించిందట ఆ ఒక్క సంఘటన సుబ్బారావుగారి జీవితంమీద చెరగని ముద్ర వేసింది. ఆనాటి నుంచి చదువుపట్ల శ్రద్ధ వహించి, దీక్షతో చదువు కొనసాగించారు

మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంటర్మీడియట్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యారు చుట్టూరా సమాజంలో కన్పించిన అనారోగ్యం ఆయనకు వైద్య పరిశోధన వైపు దృష్టి మళ్ళించింది

మద్రాసు మెడికల్ కాలేజీలో మెడిసెన్ డిగ్రీపొంది ఆ తర్వాత అక్కడే కొన్నాళ్లు శరీరశాస్త్ర నిర్దేశకుడిగా పనిచేశారు. ఆ తర్వాత లండన్ ట్రాపికల్ సర్కిల్ ఆఫ్ మెడిసిన్ నుండి డిప్లమో తీసుకున్నారు.

1923 లో మల్లాది సత్యరంగ నాయకన్ ఛారిటబుల్ ట్రస్టు సహాయంతో పై చదువులకు అమెరికా వెళ్ళాడు. న్యూయార్క్‌లోని హార్వార్డ్ స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్‌లో లైబ్రరీ ఇన్‌చార్జ్‌గా పనిచేశాడు. అప్పుడే ఆయనకు జీవరసాయన శాస్త్రం పట్ల అభిరుచి పెరిగింది.

డా॥ ఓటోఫోలిన్ అనే ప్రొఫెసర్ దగ్గర శిష్యుడిగా చేరి రెండు సంవత్సరాలు ఆయన దగ్గర చదువుకుని

(తరువాయి 40 వ పేజీ లో)

# ఆధునిక భగీరథుడు డా॥ కె. యల్. రావు

— కంచి వాసుదేవరావు

"సుజలాం, సుఫలాం మలయజశీతలాం
సస్యశ్యామలాం మాతరం వందేమాతరం"

అని బంకించంద్ర ఛటర్జీ దేశమాతకు వందనసమర్పణ చేశారు. నిజమే యావత్తు దేశాన్ని సస్యశ్యామలం చేయగల నదీజలసంపద మనకుంది. ఈ అపార జల సంపదను సద్వినియోగం చేయగల అపర భగీరథుని కోసం నవభారత నిర్మాత - ప్రథమ భారత ప్రధాని జవహర్‌లాల్ అన్వేషిస్తూ ఉండగా ఆయనకు డా॥ కె. ఎల్ రావు కన్పించారు ఈనాడు దేశంలో ఇన్ని భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులు ఉన్నాయంటే వాటి అన్నిటి వెనుకా డా॥ రావుగారి పథక రచన వుంది.

కె. యల్ రావుగారు మరణించినతర్వాత ఆయన భార్య వరలక్ష్మమ్మగారు ఆయన ఏ నదీ ప్రాజెక్టులకు పనిచేశారో ఆ నదీజలాలలో ఆయన అస్తి నిమజ్జనం చేయదలచి ఇందుకు సంబంధించిన కాగితాలు పంపవల సిం గా కేంద్ర జలసంఘాన్ని కోరారట. వారు పంపిన జాబితాలో లడఖ్ నుంచి కన్యాకుమారి వరకు గౌహతి నుంచి అహ్మదాబాద్ వరకు ఉన్న అన్ని నదుల పేర్లు చెప్పారుట. ఇన్ని నదీజలాలలో నిమజ్జనం చేయగల అస్తిసంచయనం లేనందువలన అట్టి ప్రయత్నాన్ని విరమించుకున్నట్లు ఆయన కుమార్తె ఐ ఎ ఎస్ ఆఫీసరైన సుజాతరావు ఒకచోట వ్రాశారు.

## భారతమాతకు నదీ కంఠహారం :

నిజానికి దేశాన్ని సస్యశ్యామలం చేసే నదీసంపద ఉంది. కాని అవి దేశమంతటా ఒకేవిధంగా పంపిణీ కాలేదు. గంగ, బ్రహ్మపుత్ర, గోదావరి మహానదులకు అవసరాన్ని మించిన జలాలు వుండి అవి నిరుపయోగ మవుతున్నాయి మరికొన్ని నదీజలాలు సమృద్ధిగా లేనందువలన వివిధ రాష్ట్రాలమధ్య వాటి పంపిణీ విషయంలో తగాదాలు వస్తున్నాయి. అందువలన నదీ జలాల వినియోగంలో రాజకీయాలకు, సంకుచిత రాష్ట్ర ప్రయోజనాలకు అతీతమైన జలవిధానం ఉండాలి బ్రహ్మపుత్రను గంగలో, గంగను మహానదిలో, మహానదిని గోదావరిలో, గోదావరిని కృష్ణలో, కృష్ణను కావేరిలో అనుసంధానం చేసే బృహత్ పథకానికి ఆయన రూపకల్పన చేశారు. ఆ పథకం అమలు జరిగితే సస్యశ్యామల భారతదేశాన్ని గూర్చి కలలు కన్నారు దేశ ఏ ప్రాంతమూ దుర్భిక్షం అయివుండేది కాదు. అంతేకాదు, రామపాదసాగర్ ప్రాజెక్టు గురించి కలలు కన్నారు, పులిచింతల ప్రాజెక్టు గురించి కలలు కన్నారు అవి ఇప్పటికి కలలుగా మిగిలిపోయాయి రామపాద సాగర్ కల అదో కథ - ఉమ్మడి మద్రాస్ ప్రభుత్వానికి ప్రధాన సలహాదారుగా వున్న శొంఠి వెంకటరామమూర్తి గోదావరిపైన పోలవరం దగ్గర డామ్ నిర్మించాలని కలలు కన్నారు ఇందుకు సంబం ధించిన డిజైన్లు, మోడల్సును అధ్యయనం చేయడానికి మద్రాస్ ప్రధాన ఇంజనీరుగా వున్న కె ఎల్. రావు గారిని అమెరికాకు పంపారు. ఆయన తిరిగివచ్చేసరికి ఇక్కడి పరిస్థితులలో చాలా మార్పు వచ్చింది. రామ మూర్తిగారు రిటైరయ్యారు 1946 లో ఎన్నికలు జరిగి మద్రాస్‌లో కాంగ్రెస్ ప్రభుత్వం ప్రకాశం నాయ కత్వంలో ఏర్పడడం, ఆయన మంత్రివర్గం పతనం కావడం కొమాండూరు రామస్వామి ముఖ్యమంత్రి, ఎం. భక్తవత్సలం ఇరిగేషన్ మంత్రి

కావడం జరిగింది. పోలవరం ప్రాజెక్టు వలన మద్రాసు రాష్ట్ర తమిళులకు ఏం ప్రయోజనం అన్న ఆలోచనలు మద్రాస్ ప్రభుత్వ నాయకులకు కలిగాయి కృష్ణాపెన్నా కు ప్రాజెక్టు అయితే తమిళుల ప్రయోజనాలు నెరవేరుతాయని భావించారు. సరిగ్గా ఆ సమయంలోనే రామపాద్ సాగర్ ప్రాజెక్టు డిజైన్లు మొదల్పుకై, కె ఎల్ రావుగారు మద్రాసు చేరుకున్నారు అప్పటి ఇరిగేషన్ మంత్రి భక్తవత్సలం ఆ రావుగారిని తెలివిగా ఢిల్లీకి కేంద్ర జల సంఘానికి పంపివేసి రామపాద్ సాగర్ ప్రాజెక్టుల ఆలోచనలు మూలపడేట్టు చేశారు అది దేశానికి వరప్రసాదమయింది. ఆ్న నదులను - వాటిపై డాంలను ఆయన—విస్తృత దేశ ప్రయోజనాలను దృష్టిలో వుంచుకుని రూపకల్పన చేయగలిగారు..

## రాష్ట్రగారి ఆరోబిడ్డ

రావుగారిని దేశచరిత్రలో చిరస్థాయిని చేసింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఇది ఆయన ఆరోబిడ్డ యని వరలక్ష్మమ్మగారు అంటూ వుండేవారుట ఆంధ్రుల శ్రేయస్సుకోసం ఏ ప్రాజెక్టు తలపెట్టినా దానికి అడ్డు పుల్లలు వేయడం, తమిళ నాయకులకు - ముఖ్యంగా కేంద్రంలోని తమిళ మంత్రులకు అలవాటు, రాజాజీ రాజర్షి అన్న కితాబును చాలామంది ఇచ్చినా ఆయన ఎన్ని నీతివాక్యాలు పలికినా ఆంధ్రుల ప్రయోజనాలకు సంబంధించినంతవరకు చాలా అన్యాయంగా ప్రవర్తించేవారు ఆంధ్రకు సంబంధించిన ఏ ప్రాజెక్టుకైనా నిధులు లేవని కేంద్ర ఆర్థికమంత్రి టి. టి. కృష్ణమాచారి మొండిచెయ్యి చూపేవారు. ఈ సమయంలో కె ఎల్. రావుగారు నెహ్రూను కలుసుకుని నందికొండ (నాగార్జునసాగర్) ప్రాజెక్టు ఆవశ్యకతను వివరించి ఆమోదింపచేశారు. ఆధునిక దేవాలయాలుగా నెహ్రూ వర్ణించిన నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టులు ఆంధ్రాకు లభించాయంటే నెహ్రూ విశాలమైన దృష్టి మాత్రమే కారణం.

నాగార్జున ప్రాజెక్టు రూపకల్పన నుంచి నిర్వహణ వరకు అడుగడుగునా కె ఎల్ రావు ఎంతో ఆసక్తి చూపేవారు. మండుటెండలలో కూడా నిర్మాణస్థలంలో ఎంతో దూరం తిరుగుతూ పనులను పర్యవేక్షిస్తూవుండేవారు. ఆసియాలోకెల్లా అతి పెద్ద రాతి (మాసినరీ) డాం - నాగార్జునసాగర్ డాం సిమెంటు కాంక్రీటుతో కాకరాతితో నిర్మించాలని ఎందుకు నిర్మించారన్న ప్రశ్నకు రావుగారు యిచ్చిన జవాబు ఆయన మానవతా దృష్టికి అద్దం పడుతుంది డాం ప్రాంతంలో నిర్మాణానికి ఉపయోగించే కొండరాళ్ళు అపారంగా దొరకుతాయి. ఈ రాళ్ళను పగులకొట్టి డాం నిర్మాణానికి వాడడంవలన అనేక వేలమందికి ఉపాధి కలుగుతుందని ఆయన, తన కుమారుడు అడిగిన ఇదే ప్రశ్నకు జవాబు చెప్పారుట ఈ 'ఆధునిక దేవాలయ' నిర్మాణంలో అనేక వేలమంది 'రాత్రింబవళ్ళు పాల్గొంటూ వుంటే రావుగారు పులకించిపోయేవారుట. కృష్ణానదిపై టెర్మినల్ ప్రాజెక్టుగా పులిచింతల అని ఆయన భావించేవారు. ఆ కల నెరవేరలేదు విజయవాడకు సంబంధించినంతవరకు ఇంద్రకీలాద్రి సౌరంగం, కనకదుర్గ దేవాలయానికి ఘాట్ రోడ్డు నిర్మాణం, గాంధీహిల్ సుందరీకరణ మొదలైన పథకాల వలన విజయవాడ పౌరులకు ఆయన చిరస్మరణీయులయ్యారు. బుడమేరు వరద నివారణ ప్రాజెక్టు, రాజమండ్రి గోదావరిపై రైలు బ్రిడ్జి నిర్మాణంలో రావుగారు నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది.

రైన్‌ఫోర్స్డ్ సిమెంటు కాంక్రీట్ (ఆర్సీ) పై ఆయన రచించిన గ్రంథం ఇంజనీరింగ్ విద్యార్థులందరూ తప్పనిసరిగా చదవవలసిన పాఠ్యగ్రంథం అయింది.

## నిగర్వి, నిరాడంబరుడు

ఎన్ని ఉన్నత పదవులు చేపట్టినా ఆయన నిరాడంబరుడు- నిగర్వి - నూటికి నూరుపాళ్లు శాకాహారి.

( తరువాయి 39వ పేజీలో )

సూక్తిసుధ

# కాలము పోవును మాట నిలుచును

కొమ్మరగిరి కృష్ణమోహనరావు

తరాలు తరలినా, యుగాలు దొరలినా, కాలము మారినా, మాట మాత్రం శాశ్వతంగా నిలిచిపోతుంది. అయితే ఆ మాట సత్యమైనదై ఉండాలి, ధర్మబద్ధంగా ఉండాలి. ప్రియమైనదిగా, హితమైనదిగా ఉండాలి. అప్పుడు కాలం మారినా మాట శాశ్వతంగా నిలిచి పోతుంది.

"సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్యమప్రియం
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏషః ధర్మస్సనాతనః"

సత్యమును పలుకవలెను, ప్రియమైన దానిని చెప్ప వలెను. సత్యమైననూ అప్రియంగా చెప్పరాదు, ప్రియము గదా యని అసత్యమైనచో చెప్పరాదు. ఇది సనాతన ధర్మము. కనుక యదార్థమైనప్పటికినీ, వాస్తవమైనప్పటికినీ, సత్యమే అయినప్పటికినీ, కటువుగా కుండ బద్దలుకొట్టినట్లు నిర్మొగమాటంగా మాట్లాడరాదు. ఆ విధంగా పెళసరంగా మాట్లాడితే, ఎదుటివాళ్ళకు కోపం వచ్చే ప్రమాదం కూడా ఉంటుంది, బాధపడుతారు కూడాను. కనుక సత్యమైన మాటను, మృదువుగా నెమ్మదిగా చెప్పటం నేర్చుకోవాలి

వేల, లక్షల, కోట్ల సంవత్సరాలు గడచినా సత్యమైన మాటకు చావులేదు. మనిషి మరణించినా, సత్యమైన మాట మరుగున పడిపోదు. ఆడిన మాటను నిలబెట్టుటకు ఆలుబిడ్డలను అమ్మివైచి, కాటికాపరిగా కొలువు కుదిరిన సత్యసంధు డెవరు? అని ప్రశ్నించగానే, చిన్నపిల్లలు సహితం కృతయుగంనాటి 'సత్యహరిశ్చంద్రుడు' అని సమాధానం చెబుతారు. తండ్రి మాటను నిలబెట్టుటకు, భోగభాగ్యములను సహితం పరిత్యజించి, సతితో కానల కేగిన, పితృాజ్ఞ పరిపాలకుడు ఎవరు? అని ప్రశ్నించగానే, త్రేతా యుగంనాటి 'శ్రీరామచంద్రుడు' అని ఏమాత్రం చదువు కొనని పామరుల నోటి నుండి సమాధానం వస్తుంది. ధర్మాచరణే పరమావధిగా భావించి, సతితో సోదరులతో అరణ్య అజ్ఞాతవాసములను అనుభవించిన ధర్మమూర్తి ఎవరు? అని ప్రశ్నించగానే, ద్వాపరయుగంనాటి 'ధర్మరాజు' పేరును ప్రతి ఒక్కరూ చెబుతారు. దీని వలన యుగాలు దొరలినా, కాలం మారినా, మాట మాత్రం శాశ్వతంగా నిలిచిపోతుందనే సత్యం స్పష్టమవుతున్నది. అయితే మాటలు అందరూ మాట్లాడుతారు. సత్యమైన మాటను మాట్లాడేవారు బహు కొద్దిమంది మాత్రమే ఉంటారు. ఒకవేళ అట్టి వారు భౌతికంగా మరణించవచ్చును కాని వారి సత్యమైన మాటమాత్రం శాశ్వతంగా నిలిచిపోతుంది.

"మాటలచేత దేవతలు మన్ననలంది వరంబులిత్తురా
మాటలచేత భూపతులు మన్ననలంది పురంబులిత్తురా
మాటలచేత కామినులు మన్ననలంది సుఖంబులిత్తురా
మాటలు నేర్చుకున్న నవమానము తప్పదు మూడు
పంక్తులన్"

మాటలచేత మన్ననలను పొందవచ్చును. మాటల చేత మాన్యాలను కూడా సంపాదించవచ్చును. మాటలతో మాటలను కూడా కొనవచ్చును. పూర్వకాలంలో మాటకు ఉన్న విలువ మూటకు కూడా లేదు. ఆనాడు నోటుకన్నా మాటకే ఎక్కువ విలువ ఉండేది. మాటకు ఖర్చులేదు గాని విలువమాత్రం ఎక్కువ. అయితే ఈనాడు మనిషి బుద్ధి మారిపోతుండటం వలన, వ్రాసుకున్న నోటుకు కూడా విలువ లేకుండా పోయి, కోర్టుల చుట్టూ తిరుగుతున్నారు. మంచి పలుకును పలికేందుకు మనకు భగవంతుడు నోటిని ప్రసాదించాడు. ఆర్తితో దేవదేవుని కీర్తించేందుకు భగవంతుడు మనకు నోటిని ఇచ్చాడు. కనుక మనం సత్యమైన మాటనే మాటాడాలి.

"ప్రియవాక్య ప్రదానేన,
సర్వే తుష్యంతి జన్తవః

తస్మాత్ తదేవ వక్తవ్యం,
వచనేకా దరిద్రతా ? ”

ప్రియమైన మాటను చెప్పుట చేత అన్ని ప్రాణులు సంతోషిస్తాయి అందువలన ఇష్టమైన, ప్రియమయిన మాటయే చెప్పదగినది మాట మాట్లాడటంలో దరిద్ర మెందుకు ?, అయితే మన మాట ఎదుటివారికి ప్రియంగా హితంగా వుండాలని అసత్యం మాత్రం చెప్పకూడదు.

“ ననిశ్చితార్థాత్ విరమంతి ధీరాః
అంగీకృతః సుకృతినో న పరిత్యజంతి ”

ధీరులు ఆడిన మాట తప్పరు, సజ్జనులు ఇచ్చిన మాట తప్పరు. కనుక మనం ధీరులుగానే తయారు కావాలి, సజ్జనులుగా ప్రవర్తించాలి.

‘ మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం మహాత్మనామ్ ’ మహాత్ముల యొక్క మనస్సు, మాట, చేతలు ఒకే విధంగా ఉంటాయి. అట్టివారు మాత్రమే కాలమును కూడా అధిగమించి ధృవతారలలా వెలుగొంద గలరు కనుక తాత్కాలిక ప్రయోజనమును ఆశించి ఏదో ఒకటి మాట్లాడడం ఏమాత్రం విజ్ఞత అనిపించు కోదు మనం మాట్లాడే ప్రతి మాట ఆచి, తూచి మాట్లాడటం నేర్చుకోవాలి మన మాట సత్యమైనదిగా ఉండాలి, మన బాట ధర్మమార్గం కావాలి అప్పుడే కాలము మారినా, మాట మాత్రం శాశ్వతంగా నిలచి పోతుంది (ఆకాశవాణి సౌజన్యంతో, 24-1-1995)

కె. యల్. రావు ( 31 వ పేజీ తరువాయి )

కేంద్ర మంత్రిగా వుండగా ఢిల్లీలోని ఆయన నివాసపు ద్వారాలు ఆయనతో ఆయన కుటుంబ సభ్యులతో ఏమాత్రం పరిచయం ఉన్న ఆంధ్రులకయినా తెరచి వుండేవి. అతిధి మర్యాదలకు ఎంతమాత్రం లోటు వుండేది కాదు ఈ అతిధుల తాకిడి కారణంగా కుటుంబ సభ్యులు ఇబ్బందిపడేవారుట రావుగారు స్వయంగా అతిధులను ఆదరించేవారు వీరి వీరి కార్యక్రమాలతో కాలము గలపుతున్నప్పటికీ సమయం కల్పించుకుని వారి పనులు చేసిపెట్టేవారు. తనకు మరణం సమీపించినదని తెలుసుకున్న రావుగారు, తన కుమారుని పిలిచి, నిరాడంబరత తన ధ్యేయం అని తన అంత్యక్రియలు నిరాడంబరంగా జరిపించవలసినదిగా కోరారుట

ఆయన కుటుంబ నేపథ్యం చాలా గొప్పది. ప్రఖ్యాత చరిత్ర పరిశోధకుడు, కొమర్రాజు లక్ష్మణరావుగారు ఆయన మేనమామ, 1957 లో విజయవాడ లోక్‌సభ స్థానానికి ప్రాతినిధ్యం వహించిన అచ్చమాంబ, లక్ష్మణ రావుగారి కుమార్తె. ఆయన భార్యకు మేనమామ ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఇంజనీర్లకు ఆయన నవభారత నిర్మాతలుగా భావించేవారు తన కుమారుడు అశోక్ ఐ ఎ ఎస్ ఆఫీసర్ కాదలిస్తే దేశానికి ఐ. ఎ. ఎస్ ఆఫీసర్లకన్న ఇంజనీర్లు అవసరమని చెప్పారు. ఆయన ఇంజనీరింగ్ డిగ్రీ తీసుకున్న తర్వాత ఆ విషయాన్ని రావుగారికి చెప్పినప్పుడు ‘ ఇక మీ అమ్మ దగ్గరకు వెళ్ళి వంట నేర్చుకో ’ అన్నారుట ఈ సలహాకు ఆయన ఆశ్చర్య పడుతూ వుంటే డాంల నిర్మాణసమయంలో ఎట్టి భోజన సదుపాయం లేని మారుమూల నిర్జన ప్రాంతాలలో నివసించవలసి వస్తుంది అందుకని వంట వచ్చివుండడం మంచిదని అన్నారుట.

వినతు సర్ ఆర్థర్ కాటన్, మోక్షగుండం విశ్వేశ్వరయ్యలు ఆరాధ్య పురుషులని, నదులే దైవమని ప్రకటించేవారు భరతమాతను కంఠహారంగా నదీమాలతో రంగరించి కలలు కన్నారు. ఆయన సంకుచిత భాషా ప్రాంతీయరాష్ట్ర ప్రయోజనాలకు అతీతంగా ఆలోచించేవారు.

ఆయన 1962 లో లోక్‌సభకు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. నెహ్రూ, ఇందిరాగాంధి రాజకీయాలకు సంకుచిత ప్రాంతీయ దృష్టికి అతీతుడైన రావుగారి టెక్నోక్రాట్‌గా దేశసేవలకు వినియోగించుకున్నారు కాని- ఇప్పుడు కె. ఎల్. రావుగారు వుండివుంటే - స్వార్థపూరిత రాజకీయ నాయకులు- ప్రాంతీయ దురహంకారులు- ఆయనను- పైకి రానిచ్చేవారు కాదని సుజాతరావు ఒక సందర్భంలో అన్నారు.

నిజమే ఇప్పుడు నెహ్రూ వంటి ప్రధాన మంత్రులు లేరు- డా॥ కె ఎల్. రావు వంటి టెక్నోక్రాట్లు లేరు- ఇప్పటి కలుషిత స్వార్థపూరిత రాజకీయాలలో అట్టి వారికి స్థానం ఉండదు.

సాయి దివ్య ప్రబోధ.... ( 34 వ పేజీ తరువాయి )

పవిత్రమైన భగవన్నామమును చేర్చాలి. మీరు ఈనాటి నుంచి కూడనూ యువకులలో నుండేటటువంటి ఉత్సాహాన్ని శక్తిసామర్థ్యాలను వెలుపలకు తీసి వీధి వీధి వాడవాడ భగవత్ నామాన్ని ప్రచారము చేయాలి. ఎవ్వరినీ నీవు ద్వేషించవద్దు కనుక, ఒకవేళ నీకు ఇష్టము లేకపోయినా నీవు ఊరకుండు కానీ, నామ స్మరణను మాత్రము జగత్తంతా వ్యాపింపచేయాలి. ఈ పైనఉన్నటువంటితరంగములన్నీ కూడనూ విద్యుచ్ఛక్తి తరంగములే ఈ విద్యుచ్ఛక్తితరంగములన్నీ కూడనూ అపవిత్రం కావటం చేతనే మానవుల హృదయాలు కూడనూ అపవిత్రమైపోతున్నాయి. మనం తీసుకునే టటువంటి జలములో కూడనూ మాలిన్యం ఉంటున్నాది. జగత్తంతా కూడనూ ఇప్పుడు Pollution త్రాగే నీరు Pollution తినే అన్నం Pollution పీల్చే గాలి Pollution అసలు మనస్సే Pollution (కలుషితం) అయిపోయింది. జీవితమే ఒక Pollution అయిపోయింది. దీన్నంతా పవిత్రం చేయాలి. భగవత్ నామం ఒక్కటే దీనిని పవిత్రం చేయగలుగుతుంది.

ఏనాడైనా మనం సంపాదించింది వదలిపోవలసిందే. ఎవ్వడూ ఇక్కడ శాశ్వతంగా ఉండేటటువంటివాడు కాదు కనుకనే, అట్టి అశాశ్వతమైనటువంటి తత్త్వం లోపల శాశ్వతమైనటువంటి బీజాన్ని ఈనాడు మనం నాటాలి అదియే భగవత్ నామము. ఆ నామాన్ని మనము చక్కగా ప్రపంచమంతా చాటాలి అనవసరంగా వారి మాటలు, వీరి మాటలు మాట్లాడి కాలము వ్యర్థము చేసేకంటే భగవత్ నామంచేత కాలాన్ని సార్థకం చేసుకోండి ! కనుక, మొట్టమొదట మనం చేయవలసింది అహంకారాన్ని చంపుకోవాలి. అసూయను పూర్తిగా నిర్మూలనం చేయాలి ఆడంబరమును అణచిపెట్టాలి అప్పుడే ఆనందం మననుంచి ఆవిర్భవిస్తుంది ఈ ఆనందం చేతనే భగవత్ నామాన్ని చింతించాలి.

(14-1-

---

విజ్ఞాన రథసారధులు.... ( 35 వ పేజీ తరువాయి )

Ph. D. డిగ్రీ సంపాదించుకున్నాడు. ఆ యూనివర్శిటీ లోనే ఫిస్కే అనే పరిశోధకుని సహాయంతో జీవ రసాయన శాస్త్రంలో కొత్తకొత్త విషయాలను కనుక్కొని ప్రపంచ ప్రసిద్ధిపొందారు.

కాని అక్కడ కూడా తను శ్వేతజాతీయుడు కాదు కాబట్టి కొన్ని ఇబ్బందుల్నీ, కష్టాల్ని అవరోధాల్ని ఎదుర్కోవలసివచ్చింది. ఉన్న అవకాశాన్ని ఉపయోగించుకుని పరిశోధన చేసి అనేక విజయాలను సాధించగల్గినారు. రక్తహీనత, బెంబేరి కాలేయంకు సంబంధించిన వ్యాధుల విషయంలో అనేక పరిశోధనలు చేశారు. విటమిన్ B - 12 అనే ఆహార పోషక పదార్థాన్ని గురించి సుబ్బారావుగారు ఆ రోజుల్లో, కనుక్కున్న విషయాలేఈనాటికీపరిశోధకులకు మార్గదర్శకులయ్యాయి.

ఆయన జీవితంలో అన్నిటికంటే ముఖ్యమైన ఘట్టం లీడర్లీ కంపెనీ పరిశోధనా విభాగంలో డైరెక్టర్‌గా పని చేసిన రోజులు ఆయన నేతృత్వంలోనే కంపెనీ విశేషమైన పేరు ప్రతిష్ఠలు ఆర్థిక ప్రగతిని సాధించింది. అతి శక్తివంతమైన Aromycin ఆరోమైసిన్ సుబ్బారావుగారు కనుగొనటం వైద్యశాస్త్రంలో ఒక మైలురాయి. ఈ యాంటీబయోటిక్ ఆధునిక వైద్య రంగంలో విప్లవాత్మకమైన మార్పులని తీసుకువచ్చింది.

ఈనాడు మనం ఉపయోగిస్తున్న బోదకాలుకు మందైన హైడ్రోజన్, టైఫాయిడ్ క్రిములవంటి సూక్ష్మజీవులను అరికట్టే పాండురోగ నివారకాలైన ఫోలికామర్ క్షయ రోగానికి ఆరోమైసన్ ఉపయోగించే ఇసోనికోటినికాసిడ్ హైడ్రోసైడ్ మొదలైనవి సుబ్బారావుగారి భిక్షే ! లీడర్లీలో ఈనాటికి ఆయన విగ్రహం ఉన్నదీ అంటే ఆయన వైద్య రంగానికి చేసిన సేవా ఫలితమే!

మానవజాతికి మహోపకారం చేసిన డా॥యల్లాప్రగడ సుబ్బారావుగారి ఈ వైద్యశాస్త్ర పరిశోధనలు ఎంతో మేలు చేశాయి వైద్యశాస్త్ర రంగంలో సుబ్బారావుగారి పేరు చిరస్థాయిగా నిలచిపోతుంది ! ○